# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

# GRIHALAKSHMI

**LADIES' TELUGU MONTHLY**



'GRIHALAKSHMI' GRIHA


సంపాదకుడు

డాక్టరు కె. యన్. కేసరి





సంపుటము ౨౦ జనవరి 1951 సంచిక ౧



### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయముగాలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

వరి 14 తేదీన
దేశమంతటను
విడుదల



# జెమినీవారి
# మంగళ

తెలుగు

ప్రేక్షకలోకాన్ని సంతోషములో
జలలాడించే జెమినీచిత్రము.

# విషయ సూచిక



గ్రామస్థులు చలిమంట కాచుకుంటున్నారు






జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!



# స్వవిషయం

"గృహలక్ష్మి" 19 వ సంపుటం గత డిశంబరుతో ముగిసింది; ఈ జనవరినుండి 20 వ సంపుట మారంభమవుతున్నది. అయితే వాస్తవానికి "గృహలక్ష్మి"కి 23 వ సం॥ము ప్రారంభమైందనవలె. అంటే మరి రెండేళ్లలో రజతోత్సవం జరుపుకోవాలని ఉవ్విళ్లూరుతున్నది.

ఆంధ్ర నారీమణులు "గృహలక్ష్మి"కి యథారీతిగానే వ్యాసములు, కథలు, గాథలు, ఖండకావ్యములు వ్రాసిపంపి ఆమెనాదరిస్తున్నారు. పురుషులున్నూ వెనుకపడకుండా మహిళామణులతో పోటీపడి కుప్పతిప్పలుగా తమరచనల నంపుతున్నారు. మేము రచనల విషయంలో స్త్రీజనాభ్యుదయము లగునా, కాదా అనేగాని, రచయిత స్త్రీయా, పురుషుడా అనే విభేదమును హెచ్చుగా పాటింపకపోయినా పురుష రచయితలుమాత్రం తమ దృష్టిని అసంఖ్యాకములైన ఇతర పత్రికలవైపునకుమరల్చి, "గృహలక్ష్మి"లో హెచ్చుగా స్త్రీల రచనలు పడుట కవకాశము కల్పింతురుగాకయని మా సోదరీమణుల [illegible] మేము కోరుచో మాచనువును వారుమన్నింతురుగాక. మరొక్కమాట, అందరికీ [illegible]దికూడా మనవిచేస్తాము. సరుకు క్లుప్తమైతే గిరాకీ హెచ్చుతుంది: అనే లోక[illegible] కూడ గమనార్హము.

వీలు కల్గి ప్రచురింపగల్గినప్పుడు రచయిత అభివందనములను కోరముగాని స్థలాభావమున కాలాతీతమువల్ల, ఇంక, ఇట్టి ఇతర కారణములవలన, ప్రచురింపజాలనప్పుడుమాత్రము రచయితలు, ముఖ్యంగా విద్యార్థులు, మమ్ము మన్నింపదగునని కోరుతాము.

అనుకున్నట్లు గతజనవరి 15 న రిపబ్లిక్ అవతరించింది. కాని దానిఫలితంమాత్రము మనకు హెచ్చుగా ఇంకా అనుభవయోగ్యంకాలేదు. ఆహారసమస్య, వస్త్రసమస్య, వసతిసమస్య అట్లాగే ఉన్నాయి. పెద్దపరిశ్రమలు, కుటీరపరిశ్రమలు - ఇంకా ప్లానింగు అవస్థ దాటలేదు. పార్లమెంటులో హిందూ కోడ్డుబిల్లు ఇంకా ప్యాసుకాలేదు. అనుకున్నట్లు గతడిశంబరులో కాలేదుగదా; ఈ ఏప్రిల్‌లోకూడ క్రొత్తఎన్నికలు జరుగుటలేదు. రాగల డిశంబరులోనైనా జరుగునో, జరగవో?

అంతర్జాతీయపరిస్థితులున్నూ అట్లాగేఉన్నవి. కొరియాయుద్ధం ప్రారంభమైంది; ఇంకా ముగియలేదు. దక్షిణాఫ్రికా భారతీయసమస్య తేలలేదు. పాకిస్థానతో ఇంకా సఖ్యంకుదరలేదు; కాశ్మీర సమస్య తెగలేదు. మనదేశపు సరిహద్దులలో నేపాళమున రాజ్యకల్లోలము. టిబెట్ చీనా ఆధీనము.

ఇదుగో, అదుగో అన్నట్లె ఆంధ్రరాష్ట్రనిర్మాణమున్నూ అంతులేని వాయిదా పడ్డది. కాన ఆంధ్రులకు తీరని కొరత ఏర్పడ్డది. అందుకు స్థూలమైన వ్యవహారపరిస్థితులేగాక, సూక్ష్మమైన- ఆంధ్రులనైజ స్వభావములుకూడా కారణాలైనవి. ఆ స్వభావాలను రాగలసంతతులలోనైన చక్కచేయవలసిన పని తల్లులైన గృహలక్ష్ములది.

ఈ సంవత్సరముననే శ్రీరమణమహర్షియు, శ్రీ అరవిందయోగియు నిర్యాణమంది అసంఖ్యాక భక్తపరులను దుఃఖసాగరంలో ముంచారు. భారత స్వాతంత్ర్యయోధుడు, భారత రిపబ్లిక్ సౌధమున నొక ప్రధానస్తంభము నైన సర్దార్ వల్లభభాయి పటేలున్నూ స్వర్గస్థుడైనాడు.

అయితే, ఆపదలు, ఆటంకములు, సుఖదుఃఖములు, కష్టనిష్ఠురములు మొదలైనవానినన్నిటిని లెక్కచేయక ముందు దృష్టితో ఇంటా బయటాకూడ జీవయాత్ర నడుపవలసియున్నది. ఈ విషయము నెన్నడును మా "గృహలక్ష్మి" మరువలేదు; మరువదు అని పాఠకులకు విన్నవించుకొనుచున్నాము.

కొంతకాలముగా అస్వస్థులుగా నుంటున్న మాసంపాదకులు శ్రీ డాక్టరు కేసరిగారికీ సంవత్సరమున మిక్కిలి తొందరచేసినది, కాని దైవకృపవల్ల ప్రమాదము గడచినది

సంపూర్ణారోగ్యము చేకూరకున్నను కొంత స్వస్థత కల్గినది. యథారీతి గృహలక్ష్మి సువర్ణ కంకణ ప్రదానోత్సవము ఈసంవత్సరమున్నూ స్వాయముగా నడిపింపగల్గిరి.

మరియు, నీ పత్రికకును, నింక ఇట్టి ఇతర ప్రజాహితకర సంస్థలకును మాతృసంస్థ యైన "కేసరికుటీరము"నకు ఈ.సం॥ముతో 50 సం॥లు పూర్తియైనవి. త్వరలో సువర్ణోత్సవము జరుగనై యున్నది.

ప్రతి సం॥ము వలెనే గృహలక్ష్మి నూతన సంపుటం ప్రథమసంచిక సంక్రాంతి పండుగలలో పాఠకురాంధ్ర కరకమలముల నలంకరింపగల్గుటయు నొక భాగ్యవిశేషము. క్రొత్తధాన్యము, అల్లుళ్లు, క్రొత్తకోడళ్లు, ఆడబడుచులు, నూతన వస్త్రభూషణములు, గొబ్బెమ్మ మున్నగువానివలెనే ఇంటింట "మా గృహలక్ష్మి" 20 సంపుటం ప్రథమ సంచికయు ఆహ్వానింపబడి,ఆదరింపబడ గాక. ఇతోధిక దీక్షాదక్షతలతో "గృహలక్ష్మి"ని నిర్వహింప దలచిన మాకు సదా ఆంధ్రనారీమణులు తోడ్పడుదురుగాక.

## కీ. శే. సర్దార్ పటేల్



గతసంచిక తపాలాఫీసుకు వెళ్ళేసమయంలో శ్రీ సర్దార్ పటేల్ గారు కీర్తిశేషులైనారనే విషాదవార్త తెలియవచ్చినది. కాబట్టి అందులో ఈ విషయం ప్రస్తావించడం వీలైందికాదు.

సర్దార్ భారత స్వాతంత్ర్య సేనానులలో మేటి; బాపూజీ శిష్యులలో అగ్రేసరుడు; రాజనీతిచతురులలో పేర్గాంచినవాడు. 30 సం॥లకాలం సుగ్రీవాజ్ఞగా కాంగ్రెసు వ్యవహారములను పాలించినవాడు. తనకన్నా పిన్నవాడైనా, ప్రధాని నెహ్రూని దండననిల్పి రిపబ్లిక్ పరిపాలనాభారం వహించాడు. ఆంగ్లేయులు తొలిగిపోతూ సంస్థానాలను దేశైక్యతా విచ్ఛిన్న శక్తులుగా విడిచిపోతే, వాటినన్నిటినీ, నయాన, భయాన రిపబ్లిక్ లోనికి చేర్చివేశాడు.

70 సం॥లు దాటిన వృద్ధైనా, అస్వస్థుడైనా 'హరీ' అనేంతవరకు మెడమీది కాడి దించని కర్మయోగి.

ఇట్టి ఘటనా ఘటన సమర్థుని అంతశ్శక్తికి మూలమైన వ్యక్తి ఆయనకుమార్తె మణిబెన్ పటేల్ అనేమాట భారతనారీలోకానికి గర్వకారణం. ముఖ్యంగా ఆమెకు మాసానుతాపం తెలుపుతున్నాము.

# సర్దార్ పుత్రికారత్నము మణిబెన్



శ్రీమతి పూర్ణిమా బెనర్జి

సర్దార్ పటేలును తలుచుకొని దుఃఖించడం అప్రస్తుతం. ఆయనగాని, ఆయన కుమార్తె మణిబేన్ గాని దుఃఖాన్ని తుస్కరించి, తిరస్కరించినవారు. వారెన్నడూ ఎవ్వరికీ తలవంచినవారు కారు. దర్పంతో కూడుకొన్న సర్దార్, గంభీరముద్ర వహించియుండే ఆయన కుమార్తె మాత్రము భారతదేశపు ప్రజాహిత కార్యరంగంలో ఇక్క కన్పించరు; అది విషాద కారణమే.

మణిబెన్ కు తండ్రియందు బద్ధానురాగము; అందుకామె జీవితమే సాక్షి. అనుబంధదృష్ట్యా - మణిబెన్‌ను తెలిసిన మావంటివారికి ఆమెకు కలిగిన పితృవియోగ బాధ ఏపాటిదాయన్న యోచనలు రేగుతున్నవి. మణిబెన్ ఈ సమయంలో వెలితిబడుతుందని మేమెవ్వరము అనుకోనము. ఈ దుఃఖానిశయంలోకూడా ఆమె గాంభీర్యముద్ర విడువదు; అది ఆమెకు, ఆమెతండ్రికి అలవాటే.

మణిబెన్ తనతండ్రిని ఏ భక్తిప్రేమలతో కొలిచిందో, ప్రపంచానికిగాని, తండ్రికిగాని తెలియనివ్వలేదు. ఆయనను సేవించడం ఆమెకెప్పుడు విసుగు పుట్టించలేదు; అది ఆమెకు చాల ఆప్యాయమైనపని గా ఉండేది.

ఆమె అంతర్వైరాగ్యంచాటున, కుమార్తెలందరికి విలక్షణమైన 'కౌమారీ హృదయం' దాచియుంచుకొనేది. గొప్పవాండ్ల కూతుళ్లందరికీ ఇది వక లక్షణమే.

కొంతమంది కుమార్తెలు గొప్పవాండ్రైన తమ తండ్రులయెడ ఎక్కువ అనురాగం కలిగిఉంటారు; అదే వారివ్యక్తిత్వమును పెంపొందిస్తుందికూడా. అట్టి కూతుళ్లలో మణిబెన్ వకతె.

మణిబెన్ ఏకాగ్రతతో తండ్రిని సేవించిచేది. తండ్రియందు ఆమెకుగల భక్తి విశేషమే ఆమెను మితభాషిని, కర్కశమైన దానిని, నడతలలో స్వల్పాంశములను గమనించుదానిని, తీక్ష్ణస్వభావనుగావించినది. ఆమె వ్యవహారమున, ప్రసంగమున సంగ్రహము నవలంబించుట ఇతరుల నొప్పించుటకు కాదు; కాని అట్లేకన్పించెడిది. చకచక వెంటవెంటనే వ్యవహారములను పరిష్కరించివేయడము, ఆ సందర్భమున ఆమె చూపేనిష్కర్ష అనేవానికి ముఖ్యకారణము ఆమెకు తనతండ్రియందుండే ప్రేమయే. ఈసంగతి క్రొత్తవారికికూడా కొద్దికాలంలోనే బోధపడేది. నేనామెకు క్రొత్తఅయినప్పుడు ఆమెఅంటే నాకు భయంగాఉండేది. అయితే జైలు జీవితంలో లభించే తీరిక, సావకాశము, సాహచర్యము - వీనిమూలాన ఆమెకు స్నేహితురాలనై నామిత్రులందరికి ఆశ్చర్యం కల్గించాను

నాకు బాగా జ్ఞాపకం. ఆరోజుల్లో సర్దార్ అహమ్మద్‌నగర్ జైలులో ఉండేవాడు; అప్పుడాయన మృత్యుకరాళంలో నిద్రిస్తున్నాడు. ఆస్పృహతో ఆయన కుమార్తెకు ఉత్తరాలు వ్రాశేవారు. ఆ ఉత్తరాలనిండా, అన్యోన్య ప్రేమ విషయంలో నిరాడంబరుడైన తండ్రి అట్టిదేయైన కుమార్తెకు నిండారు పుత్రికావాత్సల్యంతో వ్రాశేవాడు. వానిలో ఆయన ఆమెకు, మనమంతా ఎప్పుడో ఒకప్పుడు గతించాలనీ, ఒంటర్లము కావాలసివస్తుందని చల్లగా, మెల్లగా వ్రాశేవాడు. ఇంకా వానిలో - అత్యుత్తమమైన మానవబాంధవ్యాలను తెగతెంపులు చేసుకోవడం అవసరమవుతుందనీ, అవసరమేని వ్యక్తిగత బాంధవ్యప్రేరితములుగాని, ఇతర ఉన్నతాశయాలకొరకు కృషిచేయవలసి యుంటుందనీ, ఆయన ఆమెను హెచ్చరించేవారు. మణిబెన్‌తోపాటు మాకు గుండెలలో దిగులుగాఉన్నా ఈ హెచ్చరికలతో హితబోధనలతో ధైర్యం వహించేవారము, ఆ దుర్దినాలలో. ఈ హెచ్చరికలు ఆమెపాలిటికి దుశ్శకునాలు కావు; ఆమెకు మాకు కూడ ప్రతిఫలంకోరని ప్రేమాతిశయం గలవారికి, అత్యాశ్చర్యకరంగా అనురాగం వర్షించడంలాంటివి.



(50 వ పుట చూడుడు)



# తుది మ్రొక్కు

ఒక్కమహోజ్వల రతనము
దిక్కులు మిరుమిట్లుగొలిపి జేదివ్య ప్రభల్
గ్రక్కుచు దాగెను భువిలో
నెక్కడ బుట్టినవి యచటికేగెడి తుదికిక్ .

కుడిభుజము నేటితో ధరకూలెననగ
భరతమాతకు కడుదీనభావ మొదవె ;
భారతీయుల కడుపులో భగ్గురనగ
అరిగె వల్లభాయి పటేలు నేడమరపురికి.

చిరతరయశశ్శరీరుడై చెలగుచుండ
పరమ మంగళమగునాత్మ బ్రహ్మపథము
బొంది విహారింపగా చచ్చిపోతివనుచు
దలచుటెంతయు మాపిచ్చితనము గాదె
శాంతి నీయాత్మ; కిదెనమస్కారశతము.

గంటి కృష్ణవేణమ్మ

# ఆంధ్ర మహిళా మహాసభ, నెల్లూరు.



## శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయిగారి అధ్యక్షోపన్యాసము

**(29-12-50)**

ప్రపంచపరిస్థితి యీనాడు మహావిషమరూపం ధరించింది. మహిళలు స్వభావసిద్ధ శాంతి ప్రియులు. ప్రపంచ సంస్థలలో వారికి తగినస్థానం లేకపోవటం దురదృష్టకరము.

శాంతి స్థాపనమే మహిళా ఉద్యమానికి ప్రధాన లక్ష్యం. అయితేనేమి! ఇది యీనాడు ఎంతో దుర్బల స్థితిలో నున్నది.

బలిష్ఠమైన పునాదులపై మహిళా మహోద్యమాన్ని నెలకొల్పడం వల్లనే శాంతి సహకారాల వ్యాపకం సాధ్యపడగలదు. దీనికి వేరొకమార్గము లేనేలేదు. ఇటువంటి వార్షిక సమావేశాల సందర్భాన మహిళాఉద్యమానికి ఆంధ్రదేశం చేసిన కృషిని సమీక్షించండం అనుచితం కానేరదు. ఈ దృష్ట్యా-చూస్తే మహిళా మహాసభ ఆంధ్రశాఖ కృషి, ఇతరశాఖలకృషి వలెనే బహుస్వల్పమైనదని ఒప్పుకొనక తప్పదు. వ్యవస్థాపకత్వ దౌర్బల్యమే దీనికి కారణం. ఈ దౌర్బల్యాన్నే అభివృద్ధినిరోధకులు సాకుగాగొని సాంఘిక సంస్కరణావసరమైన చర్యలకు పలువిధాల ప్రతిబంధకాలు కల్పిస్తున్నారు. వ్యవస్థాపకత్వములోను, నిర్మాణంలోను లోటు పెట్టుకుని హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లు సత్వరంగా ఆమోదించనందుకు కేంద్రప్రభుత్వాన్ని దోషం పెట్టటం సమంజసంకాదని నేనుభావిస్తున్నాను.

జాతీయ స్వాతంత్ర్య సమరములో ఆంధ్ర మహిళలు దేశసేవికలుగా అపూర్వమైన బాధ్యతను నిర్వర్తించారు. ఆ వేలాదిదేశసేవికలు ఇప్పుడు ఎక్కడ కనిపించర్రే? వారి అండదండలను మనము మన ఉద్యమ ప్రాబల్య సాధనకు, ఉద్యమ వ్యాప్తికి సమకూర్చుకొనలేక పోయామని అనడానికి సాహసించినందుకు నన్ను మన్నించ కోరుతాను. ఈసందర్భములో ముఖ్యముగా ప్రభుత్వరథచోదకులదే తప్పు అని నేను నొక్కిచెప్పగలను. ఆహారసమీకరణలలో నేమి, కొండంతలుగా పెరిగిపోతున్న ధర వరులను అరికట్టడంలోనేమి నిరక్షరాస్యతా నిర్మూలనలో నేమి ప్రజాసహకారములేనిదే ఏ ప్రభుత్వవిధానం కూడా విజయం పొందజాలదు. 1920-1930 సంవత్సర ప్రాంతాలలో స్వాతంత్ర్య శంఖారావాన్ని ఆకర్ణించి వేలకు వేలుగా సత్యాగ్రహ సమరాలలోనికి దూకి అనల్పత్యాగంచేసిన దేశసేవికలనుమించి ఈ సహకారాన్ని ఇవ్వగల వారెవరు? ఏ ఆహారసంఘాన్నైనా ప్రభుత్వంనియమిస్తే, అందులో గవర్నరుగారి సతీమణో లేక ఉన్నతోద్యోగుల భార్యలో సభ్యురాండ్రుగా నియమించబడుతారు. మరి ఆసంఘం చేసే కృషి ఫలితాన్నిగురించి వేరుగా చెప్పనవసరములేదేమో!

స్వాతంత్ర్యం వచ్చినతరువాత పురుషరాజకీయవాదులు సాధించిన మహాకార్యం ఏలోకల్ బోర్డు సభ్యత్వమోకాగా, ప్రముఖ దేశసేవికలు ఎంతో ఎంతో శ్రమపడి శ్రీ కస్తూరిబా విద్యాలయం, శారదానికేతనం, సేవాసదనంవంటి సంస్థలనెలకొల్పుతూ వచ్చారు. రాజకీయాలతో నిమిత్తంలేని, మగవారు స్థాపించిన క్లబ్బులు వినోదాలకు, ఆటపాటలకు నిలయాలుకాగా, స్త్రీల క్లబ్బులు కాని, సభలు కాని ఏదో ఒకవిధమైన నిర్మాణాత్మకకృషికి కేంద్రాలుగా, కనీసం ఏహిందీభాషో చేతిపనులో నేర్పబడే కేంద్రాలుగా నయినా ఉపకరిస్తున్నవి. ప్రభుత్వంకాని, నాయకులుగాని ఈ సత్యాన్ని గుర్తించి దేశసేవికల సహకారాన్ని పొందనంత కాలం దుస్థితి తప్పదు.



(50 వ పుట చూడుడు)



# మా తపాల్ పెట్టె



19-వ సంపుటం (1950-వ సం||ము) పూర్తి అయి 20-వ సంపుటం ప్రారంభమైంది. కాబట్టి మా తపాలుపెట్టె నొక్కసారి దులిపిచూచాము; 19వ సంపుటము నొక్కసారి తిరగవేశాము. వానిఫలితంగా మా పాఠకురాండ్రకు, ఈ క్రింది విషయాలు తెలుపగలుగుచున్నాము.

భాషాప్రవీణ చోరగుడి హనుమత్ శేషమ్మ గారు వ్రాసిన "ఊర్మిళ" 4 రంగముల నాటిక 4 మాసములలో ముగించి, శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు రచించిన "ముక్తాంబ" అను నాటకము ప్రారంభించితిమి. శ్రీమతి వంగల వాణీబాయమ్మ గారు వ్రాసిన "సాధ్వి" అనే సీరియల్ కథను కూడా ఈ మధ్యనే ప్రకటించుట మొదలుపెట్టితిమి. శ్రీ కల్లూరి అహోబలరావుగారి "గృహలక్ష్మికి పద్యరత్నములు"ను, శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారి "కాలుట్లాధిప చెన్నకేశవ రమాకాంతా మనోనాయకా" అను పద్యములు ఇంకను ముగియక నడచుచున్నవి. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు శారదలేఖలు పూర్వమువలె తరచు వ్రాయకున్నను తీరికయున్నపుడెల్ల వ్రాయుచున్నారు. శ్రీ రమణమహర్షి సన్నిధాన వర్తియై ఉంటూ వచ్చిన శ్రీమతి సూరి నాగమ్మగారు తమ సోదరులు శ్రీ దోర్బల శోభనాద్రి శాస్త్రిగారికి భగవాన్ ప్రస్తావనగా చేసిన దివ్యబోధనలను ప్రస్తావించుతూ వ్రాసిన లేఖలను, ఇదివరలో గ్రంథరూపాన ప్రచురించని వానిని వరుసగా ప్రచురిస్తున్నాము.

ఇంకను పలువురి కథలు, పద్యములు, పాటలూ వీలున్నంతవరకూ ప్రచురించుటకు ప్రయత్నిస్తూనే యున్నాము.

మా తపాలుపెట్టె దులిపిచూడగా ఈ సంవత్సరము (1950 లో) మా కార్యాలయమునకు అందిన రచనలలో అచ్చొత్తించినవి, నిరాకరించినవి, పోను ఇంకా నిలువ ఉన్నవానిని వర్గీకరణ మొనర్చగా. ఈ క్రింది వివరాలు తెలియవైనవి.

| | | |
|---|---|---|
| మొత్తము వ్యాసములు | — | 414 |
| అచ్చొత్తించినవి | — | 136 |
| నిరాకరించినవి | — | 90 |
| మావద్ద నిలవ వున్నవి | — | 188 |

ప్రచురించుటకు మాకు చాల తక్కువ అవకాశాలున్నా, రచయితల ఉత్సాహము భంగపరచకూడదనే వుద్దేశంకొద్దీ, తిరుగగొట్టబడిన కొద్దివిపోను మిగత వానిని వీలు వెంబడిని ప్రచురిస్తూనే యున్నాము. కాని చాలా నిలువయుంచక తప్పడములేదు. ప్రతిరోజూ క్రొత్త రచనలు వస్తూనే వున్నవి. ఇంతకుముందు రచనలు పంపి, ఇంకనూ ప్రచురించక పోయిననూ, వారు మా మీద కోపము, విసుగుజెందక, వారి వుత్సాహము ఏమాత్రము తగ్గించుకోకుండా, మరల క్రొత్త రచనలు పంపుతునే యున్నారు. వీరికి మా ఇబ్బందులు బోధపడే కాబోలు మామీద కోపగించుకోవడం లేదు. ఈ చిక్కులు తెలియని కొందరు రచయితలు మాత్రం తాము రచనలు పంపిన మరుసటిదినమునుండే "మా వ్యాసమును ఈమాసములోనే ప్రకటిస్తారా, లేదా? ఏసంగతి వెంటనే తెలుపవలెను. నేను ఇదివరకు పంపినకథ ప్రకటిస్తామని ఏల ఇంకనూ ప్రకటించలేదు? స్త్రీల కొరకు ఏర్పడిన పత్రిక కావున మా ఉత్సాహాలను అణగద్రొక్కరని, ఇంకొక పద్యమును ఈ మాసములో తప్పక ప్రకటిస్తారనే వుద్దేశంతో పంపుతున్నాము" అని మామీద కారాలూ మిరియాలూ నూరుతూ చనువుతో వ్రాస్తారు. మరి కొంతమంది మాకు పక్షపాతమని తలుస్తారు. అందుకనే మా యొక్క ఇబ్బందులు ఇంత వివరముగా వ్రాయుచున్నాము. అయితే ఒక్క విషయం. మాతోపాటు మా రచయితలుకూడా గృహలక్ష్మికి చేయుచున్న సేవ మేమెన్నటికీ మరువజాలము.



(53 వ పుట చూడుడు.)

# ఈ సంవత్సరం సంక్రాంతి పురుషుడు

ప్రతి సంవత్సరమున్నూ సంక్రాంతిపురుషుడు ఒక్కొక్క రూపంతో, ఒక్కొక్క విలక్షణమైన చేష్టలతో, అలంకారాదులతో అవతరిస్తూ ఉంటాడు. ఆయావానివల్ల శుభాశుభఫలములును ప్రజలకు కలుగుతూ ఉంటాయని శాస్త్రమర్యాద.

ఈ సంవత్సరం సంక్రాంతిపురుషునికి రెండు ముఖాలు; నల్లటిశరీరచ్ఛాయ; వికారమైనరూపం; మూడుకళ్లు; నాలుగునోళ్లు; బొద్దుగా పెరిగిన కనుబొమ్మలు; పొడుగాటిముక్కు; దొప్పచెవులు; నెత్తురు కారుతూ ఉండే చిగుళ్లతో పండ్లు; మహాఘోరమైన వికృతాకారము; 8 చేతులు; 3 పాదములు; దున్నపోతు వాహనం; దశయోజనముల ఎత్తు; ఆయన ఆక్రమించిన స్థలం అందుకు 12 రెట్లు ఘనచదరము!

ఈయన పేరుకూడా ఇందుకు తగినట్లే ఉన్నది. ఘోరుడు; దీనివల్ల శుభంలేదు. అగరుతో స్నానం చేశాడు; అందుచేత బాగా వానకురుస్తుంది. కంబళికట్టుకొని కప్పుకొన్నాడు; దీనివల్ల మునులకు నాశనం. (అసలు ఈ కాలంలో మునులే లేరు; ఉన్నకొద్దిమందికి నాశనం, ముందు సూచన కన్పించింది కాదా; శ్రీ రమణమహర్షి అరవిందయోగికూడా నిర్యాణంచెందారు; సాధువులనందరిని 'విద్యాదానాదికము వంటి దేదైనా కృషిచేయండి; సోమరులుగా ఉండకండి' అని ప్రభుత్వమువారు అంటున్నారు; ఆ మధ్య జగన్నాథరథోత్సవంరోజున సాధువులను పోలీసులు లాటీఛార్జికూడా చేశారు.) రక్తమునే గంధంవలె వంటికి పూసుకున్నాడు; విషమునశిస్తుందిట! (విషజంతువులకా? మనుష్యులకా? లేక ఒకటతగ్గి ఒకటపెరుగుతుందా?) నీలోత్పలములను ధరించాడట; దానివల్ల పండ్లుపండడం నాశనం. పగడాలదండకూడా, ఈ అందానికి; అయితే దానివల్ల దుర్మార్గులు కొంతనశిస్తారు. తగరపుగిన్నె చేతబట్టుకున్నాడు; రోగాభివృద్ధి ఫలితం. పాలు త్రాగుతాడు; దానివల్ల కీర్తిహాని. తాటిపండు తింటాడు; (ఆహారసమస్య నెదుర్కొడానికి ధాన్యేతరపదార్థ భక్షణమునవలంబించాడు కాబోలు!) దానివల్ల న్యాయంగానే శుభం. తూర్పు తట్టుతిరిగి - ఉన్నాడు; దానిఫలితం విరోధం. (చాలా రోజులైందిగదా తూర్పుదేశాలలో విరోధాలు ప్రారంభమై.) తోమరాయుధం. యుద్ధం. (శుభం!) (ఆ సూచనలు కన్పిస్తూనే ఉన్నాయి గదా!) నెమలిగొడుగు; మరణం. (విరోధాలు, యుద్ధాలు - ఆటంబాంబులు - మరణంగా పరిణమించక ఏమవుతాయి.) దున్నపోతు నెక్కినందున ప్రపంచంలో ఆకలిమంటలు రేగుతాయి. (అదీ నైజమే.) లొల్లాయి ముఖం పెట్టుకొంటాడు. (జైలులో లొల్లాయిఅంటే - పనిచేయకుండా తలాయించుకతిరుగుతూ నల్లకుళాయిధరించే పాతకేడీ!) అందువల్ల వర్షంఉండదు. కూర్చుంటాడు; వెలలు మధ్యమం. వాయువ్యదిక్కుగా ప్రయాణం; ఆ దిక్కుకునాశనం. (పాకీస్థానంలో, వాయువ్యసరిహద్దు రాష్ట్రంలో అన్నమాట, అబ్దుల్ గఫూర్ ఖాన్‌కు జబ్బు; అఫ్ఘన్ వారిపఠాను రాజ్యోద్యమ ప్రోద్బలము; కాశ్మీరసమస్య ఇత్యాదయః ఉండనే ఉన్నాయికదా!) ఇతడు ప్రవేశించిన మాసఫలం: వ్యాధులు, కరవు, దొంగలు మొదలైనవానివల్ల భయం. శుక్లపక్షఫలం: జగత్తుకుహాని; కరవు. సప్తమీఫలం: రోగములునశిస్తున్నవి; క్షేమమున్నూ. ఆదివారం ఫలం: క్షేమం. కాలఫలం; రాజులనాశనం. లగ్నఫలం: సుఖం. ముహూర్తఫలం మేఖముల నాశనము.

ఇవన్నీ మనం ఏమాత్రము పట్టించుకోకుండానే, ఈ సంక్రాంతిపండుగలను యథారీతిగానే, పప్పుపరమాన్నాలు చేసుకున్నాము; క్రొత్తబట్టలు కట్టుకున్నాము; అల్లుళ్లను కూతుళ్లను పిలిపించి సత్కరించాము; ఉత్సవంచేసుకొని ఆనందించాము.

# గొబ్బిపదములు

శ్రీ కాలకంధరం
సంజీవరాయశర్మగారు

ఆంధ్రవాణికి తొట్టతొల్తన సొబగులు సంతరించి పదప్రతిష్ఠ కలుగఁజేసినవారు పదకవులు. స్వచ్ఛందగతిని జాలువాఱ రక్తిగా పదములనుపాడి జానపదులను రంజింపఁజేయుట వీరికి వెన్నతోఁబెట్టిన విద్య. వీరు గ్రంథరూపములుగ పాడినపాటలే ఋక్కులై కావ్యములలోని కెక్కుటకు అధర్వమును, అవలంబనీయమును, అయినదని కొందరందురు. ఔగాక! ఈ జానపదగీతములు ఆచార వ్యవహారములకుఁ బ్రతిబింబములు. ఈ పదములు సంఘములోని దురాచారములను కడిగి, గాలించును. ఈగీతములలో ఆనందమును, విజ్ఞానమును బెరసి పూసలలో దారము క్రియ నుండును. ఈ గీతములు చల్లగా వీనుల కెక్కుచో అపూర్వమును అనన్యమునగు హాయిని జేకూర్చును. నిద్రిత హృదయుల మేల్కొల్పును.

ఈ గేయములను పండుగపబ్బములకును, జాతరలకును పాడుదురు. ఇట్టిరచనములు మధురముగా మృదువుగా అచ్చమగు నుచ్చారణముఁగలిగి చక్కని నానుళ్ళకు, పలుకుబళ్ళకు నెలవుగ నుండును. ఇట్టి పదములు నన్నయ్యకుఁ బూర్వముండియుండునని శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి అభిమతి. "పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రములో పేర్కొన్న తుమ్మెదపదములు, ప్రభాతపదములు మున్నగునవి ఈ కాలమున ఉండవచ్చుననియు వానికంటెఁ బ్రాచీనములు యక్షగానములు అనియు అవే ద్విపదగ పరిణమించె" (చూ. 12 ఉగాది సంచిక.)

పంద్రెండవ శతాబ్దము జానపదుల జీవిత వికాసమున లోకమహోన్నతమైన పబ్బము. సాహిత్యమున విప్లవమును గొనివచ్చి ప్రజలనందు భాగస్వాములుగఁ జేసినవారు శివకవులు. అందు పాల్కురికి సోమనాథుడు గ్రామజీవితమునందలి హాయిని వారిమనః ప్రవృత్తులను గమనించి వారిని విజ్ఞానవంతులుగ చేయుటకు గొప్ప ప్రయత్నము సలిపినవాడు. ఆ కాలము పదకవిత్వమునకు కోటారమ్ము వంటిది, ఆ పదములందలి హూరువుల గన్గొని తిన్నగా తన గ్రంథములలోని కెక్కించినాఁడు. ఆ కాలమున వెలసిన పదములగనుఁడు:

"పదములు తుమ్మెద పదముల్ ప్రభాత
పదములు పర్వతపదము లానంద
పదములు శంకర పదముల్ నివాళి
పదములు వాలేసు పదములు గొబ్బి
పదములు వెన్నెల పదములు...."

◆ ◆ ◆

ఈ పాల్కురికి సోమనయే తన బసవ పురాణ రచనమునకు ఇట్టిపదములు మూలములయినట్లు నుడివికొనియున్నాడు చూడుడు:

"ఆతత బసవ పురాతన భక్త
గీతార్థ సమితియే మాతృకగాఁగ
పూరితంబై ఒప్పు పూసలలోన
దారంబుక్రియ పురాతన భక్త
చరితలలోపల సంధిలు బసవ
చరితమె వర్ణింతు సత్కృతియనఁగ"

◆ ◆ ◆

"బసవన్న గీతముల్ వచరించువారు
బసవపురాణ మొప్పఁ జదువువారు"

◆ ◆ ◆

"అరుదగు దానయ్య యఱువత్తు మువురు
చరితంబులను శ్రీ బసవ పురాణంబు
నేలలు వెట్టంగ నింపు సొంపార
శైలిమ్రోగాలుచుఁ జదివెడువారు

"చాతుర్య మెసగ బసవ దండనాథు
గీతంబులాదిగా గీతాఢ్యులైన
సకల పురాతన చారుగీతములు
ప్రకటించి ప్రకటించి పాడెడివారు."

ఇయ్యది పండితారాధ్య చరిత్రమందలి ద్విపద. దీనినిబట్టి బసవ పురాణ రచనమునకు పైపదములు తోడ్పడినవని చెప్పక చెప్పుచున్నది గదా! కావున పదకవిత కానాడు ఎంతటి గౌరవముండెడిదో యెఱుకయగుచున్నది. పదకవిత్వ మహనీయ స్ఫూర్తి మూర్తి బలుపుతే వారి కవిత్వమునకు వెలుగు కలుగఁజేసి యుండునన్న ఒప్పుదురుగదా! ఈ పదములకు కావ్యాదులలోను లక్షణ గ్రంథములలోను జక్కని పలుకఁబడిగలదు. కస్తూరి రంగకవి తన ఆనందరంగ రాట్ఛందమున కొన్ని పదముల పేర్కొనినాడు. "పదములు: సూళాది తాళకొట్నములు, ధవళములు, శోభనములు, ఉరుటణులు, ఆరతిపాటలు, జోలలు, ఏలలు, అష్టకములు, గొబ్బిళ్లు, చందమామ పదములు మున్నగునవి." నన్నిచోడకుమార సంభవములో గొన్ని పదములు పేర్కొనబడియున్నవి. పార్వతీకౌమారమున:

"లీల నీశ్వరు నంకమాలికల్ పాడుచో
గీతభేదంబుల రీతులెఱిగి"

అని గలదు. అందే వసంత సమయమున:

"ఎలమి జిలుకపిండు దోలుమేన జేసిన
తపము పండ బండె తరువనంబు;
లువిద లింపుమిగుల 'నూయలపాటలు'
పాడ మధువనమున బాడె వళులు"

ఇందు ఊయల పాటలు పేర్కొనబడినవి. తంజాపురమున రఘునాథరాయల నాస్థాన రంగవల్లి కలలో తన కవితాకన్యచే అద్భుత భరతాభినయములతో నాట్యము జేయించిన చేమకూర వెంకటకవి తన విజయవిలాసమున "ధవళంబులు" మొదలగు కొన్ని పాటల బేర్కొని ఆనాటి ఆచార వ్యవహారముల కనువైన జాతరలో "చెలుల ఆటలు పాటలు నిత్యకృత్యమై సాగగ" జేసినాడు. ఇంకను, భాగవతము, కళాపూర్ణోదయము, ఆముక్తమాల్యద, మొదలుగాగల గ్రంథములలో ఆనాటి సంఘమున గల ప్రజల పలుకుబళ్లలోనున్న పదములు పెక్కులు పేర్కొనబడినవి. ప్రస్తుతము ఉద్దేశము "గొబ్బి" పదములనుగూర్చి వ్రాయుటయే.

## గొబ్బిళ్లు

గొబ్బిళ్లపాటలు మార్గశిర మాసమున సంక్రాంతి సమయమున కొందరు పడుచు కన్యలుకలసి వాకిట గోమయముతో గొబ్బి దేవతను చేసి గుమ్మడి పువ్వులతో నలంకరించి బహుమనోహరములగు రంగవల్లులబెట్టి గొబ్బిళ్ళు తట్టుదురు. తదనంతరము గొబ్బి దేవతకు చద్దెన్నమును నైవేద్యమును పెట్టుదురు. ఈ యాచారమును ఆంధ్ర తమిళ దేశములలో తప్పక నిప్పటికిని పాటింతురు. తమిళమునందును ఈ పండుగకు "గొబ్బి" అని అందురు. ఈ పదములలో కొన్ని శృంగార మయములుగను, వేదాంత పరములుగను నుండును. మఱియు కావ్యములలో వర్ణింపబడు పుష్పలావికాది వర్ణనలును కలవు. కొన్ని పదములు తుమ్మెద పరములుగను గలవు.

## లక్షణము

ఇట్టి పదములను మాత్రాచ్ఛందముతో గలిపి వ్రాయుదురు. వీటికి మట్టు, లయ, ప్రధాన గుణములు. లక్షణమును జొప్పింపవలయునని వారు యత్నింపరు. వారు తలపకయ కొన్ని పదములు ఛందోలక్షణము ననుసరించి కూర్పబడి యుండును. ఈ క్రింద నొసగు పదములలో కొన్ని పట్టుల "ద్విపద" లక్షణమునకు సరియగుచున్నది. యతి స్థానమున మాత్రము కొన్ని యెడల భిన్నముగ నున్నది. "ద్విపద" ఐహికాముష్మికములకు హేతువుగాన ద్విపద లక్షణము అట్టి పదములనుంట విశేషములో విశేషము.

పుష్పలావికలు కావ్యములలో వర్ణింపబడు చుందురు. విజయ విలాసమున పుష్పలావికలనుగూర్చి ఒండు పద్యముగలదు చూడుడు :

"ప్రాయపుగాయకు ల్వ్రేలనె
పాన నెగాదిగఁ జూడ నేర్పు లౌ
రా యివి; దండమీఁద కొస
రం దొరఁకొంటిరి ; మంచి సాము లే
పో; యటులైనచో సరస
ముల్గద మీకిపు"డంచు నవ్వురిం
గాయజు తూపులమ్ముదురు
కందువ మాటల బుష్పలావికల్."

ఇట్టి పుష్పలావికలు యయాతి చరిత్రము, సుదక్షిణా పరిణయము, బిల్హణీయము మున్నగు కావ్యములలో వర్ణింపబడియున్నారు. ఇట్టి పుష్పలావిక పదమే గొబ్బిపదములలోనున్నది. చూడుడు :

'కోలుకోలు యింటి కోడ లొప్పందమాయె
కొప్పుకు తగ్గాది కుప్పెసవరము..."

♦ ♦ ♦

"దాలబందరంమీాద దాగుండెచిలుక ;
సీతోటిచిలుకలూ ఎందుబోయాయి ?
చినచిన్న బుట్లతో పూలేరబోయె ;
తుమ్మచెట్లాక్రింద తూర్పారబట్టి
జిల్లేడుచెటుక్రింద జల్లెడలాబట్టి
తూరుపుపోరన్న ; తూము తేరన్న ;
పడమట పోరన్న ; బల్ల తేరన్న ;
చెడుపుల్ల ; పడుపుల్ల బండికావించి
నల్లెద్దు, పుల్లెద్దు బండిగట్టించి
ఏసిరే, బీగాలు ; తరిమిరే బండ్లు ;
ఎగువ తిరుపతి వెంకటేశులు !
పూలయ్య పూలో !!
పూవుల్లవెలలేమి చెప్పరే చేడె ?
ఎఱ్ఱగన్నేరు పువ్వు లేడువేల్సామి ;
పచ్చగేదగిపూలు పదివేలుసామి ;
పచ్చగన్నేరుపూ లిరువదివేల్ సామి ;
దిగవతిరుపతి గోవిందరాజులు !
పూలయ్య పూలో !!"

## గొబ్బి పదములు

పదునాఱవ శతాబ్దిని వెలసిన ప్రఖ్యాత సంకీర్తనాచార్యులు తాళ్లపాక అన్నమయ్య పదమును చూడుడు:

"కొలని దోపరికి గొబ్బిళ్లో-యదు
కులస్వామికిని గొబ్బిళ్లో !
కొండగొడుగుగా గోవులగాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో !
దుండగంపు దైత్యులకెల్లను-తల
గొండు గండనికి గొబ్బిళ్లో !
పాపవిధుల శిశుపాలుని తిట్టుల
కోపగానికిని గొబ్బిళ్లో !
ఏపున కంసుని యిడుముల పెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్లో !
దండివైరులను దరిమిన దనుజుల
గుండె దిగులుకు గొబ్బిళ్లో !
వెండిపైడియగు వెంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్లో !"

♦ ♦ ♦

ఈ పద కవిత్వమునకు విశేషముగు పలుకుబడి తంజాపుర ఆంధ్రనాయక రాజుల కాలమున కలిగినది. ఈ నాయక రాజులు యక్షగానముల రూపమునను, పదముల రూపమునను కవులచే వ్రాయించి

స్వయముగ అపుడపుడు నాట్యశాలలో ప్రదర్శింప జేయుచుండిరి. తంజావూరిలోనికన్నెపడుచులు తెలిచు వలరాయనిమీది "ఏలలు" పాడుదురట. విజయ రాఘవ చంద్రికావిహారములోని పదము చూడుడు :

"సవరణసేసిన కోటలు వీట
సరసులు నూరారు కోటులు ;
వలరాయనిమీద ఏలలు
చాల వర్ణింపనేర్చిన బాలలు"

ఆ కాలమున వెలసిన యక్షగానములలో గొబ్బి పదములు పెక్కులుగలవు. సంగీత మొకవంక, సాహిత్యమొకకెలన, నాట్యమొకదిక్కు, చిత్ర లేఖన మొకప్రక్క తంజాపుర నాయకరాజులు విశేష ప్రచారమునకుతెచ్చిరి. ఆకాలమున వెలసిన పదములకు మితిమేరలేదనియే నుడువవచ్చును. ఈ గొబ్బిపదములు తమ మృదుమధుర కంఠస్వరములతో బాలలు నవ్వీట పాడుదురట! "దక్షిణ దేశమందలి ప్రజలుయిప్పటికిన్ని నాయకరాజుల పుణ్యకథలు ఒళ్లు పులకరించగా కన్నుల ఆనందబాష్పములు రాలగా స్మరిస్తూఉంటారు" అని శ్రీ కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు "తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర" తొడిమలో నుడివిరి. ఆ పద్యములను చూడుడు:

"చిలుపని తావులుం జవులు
జిమ్మెడు కమ్మని పువ్వుదేనెల్లో
వలగొని గానలక్ష్మి నిలు
వన్ చెలువమ్ముల నించుహూపు రే
ఖలోయనునట్లు తంజపురి
కన్నెలు కొందరు గొబ్బిపాడ మె
చ్చు లోలుక వీనులంగనుల
జుబ్బనచూలిలు జుట్టిపొంగితిన్.

♦ ♦ ♦

వినునో వీనులు కాంచునో కనులు ను
వ్విళ్ళూరు నోజిహ్వ నె
మ్మన మేమయ్యెనొ తక్కనంగములునె
మ్మానడ్కన్ బ్రవర్తించునో
యనుమానింపగరాక తంజపురి ది
వ్యస్తవ్య మార్దంగిక
స్వన గానామృతపానపుందమి మహో
త్సాహంబు మాకేర్పడెన్."

ప్రజలు మిక్కిలి ప్రాచీనములగు నిట్టి ఆచారము లను కొంతవరకైనను పాటించు చుంటచేతనే యిప్పటి వరకును విస్మృతి పథమున బడక నిలచియున్నవి. పాశ్చాత్య విజ్ఞాన జంఝామారుతమునకు యిట్టి జాన పద గీతములు చాల నశించినను ఆ మిగిలిన కొంతవర కైనను గ్రామీణులు పాటించుచునేయున్నారు. ఈ త్తమసారస్వతమునకు ఆదర్శమును, భద్రపేటికయు నైన నిట్టి పదములను కాపాడుట స్త్రీలవంతు. భద్ర పరతురుగాత! విజయోస్తు.






పల్లెలలోనివారు కనుపండువుగాగ గృహాంగణమ్ములన్
పిల్లలతోడ పొంగళుల ప్రీతిని బొందుచు నారగింత్రు; రా
జిల్లెడు సిగ్గుతో రమణ చేడియ లందఱు భర్తలన్ వెసన్
చల్లని వీక్షణంబులను చంద్రికలన్ వికసింపజేతురా.

కంకణంబుల కింకిణీక్వణము లొలయ క్రొత్తచీరను కైసేయు కూతురొకతె
మంజుమంజీర రవణంబు మధురమొసగ క్రొత్తముగ్గుల కైసేయు కోడలొకతె.

పాలివానికి క్రొత్తగ వస్త్రములను గట్టనిత్తురు పల్లెలో నెట్టులైన
బీద సాదలకెల్లను బిక్షమిడగ సంతసింపగ "సంక్రాంతి" కాంతినొసగు.

కొండూరి నరసింహాచార్యులు.

* * *

ముసలివారలుగూడ పొసగిన భక్తితో చలివేళ స్నానాలు సల్పుచుండ;
పండుగసెలవుల పబ్బాలు గడుపంగ విద్యార్థు లింటికి వేడ్కరాగ ;
బిచ్చంబుకోసమై యిచ్చకంబులు చెప్పు భట్రాజులెల్లెడ పరిఢవిల్ల ;
అబ్బురంబుగ మామలల్లుండ్ర బిలువంగ అన్యాయముగ వార లలుకబూన ;

పంచరంగుల బొమ్మల పత్రికలతొ తీయతీయని వింతల తీరులొలుక ;
అరుగుదెంచెడిసంక్రాంతి ! అందుకొనుము హృదయపూర్వకమైన మావందనములు.

అయ్యగారి కనకం

* * *

పరదాస్యపద నీచభావముల్ సకలంబు మఱఁగిపోవుత భోగిమంటలోన!
ప్రజలందుఁగల పరస్పర విరోధములెల్ల మండిపోవుత భోగిమంటలోన!
దారిద్ర్యదుఃఖ నిద్రాణాది దోషముల్ మాయమౌతను భోగిమంటలోన!
క్షామదేవత ఆర్యభూమి నంటినదోష మంటఁగాలుత భోగిమంటలోన!

సకలసౌభాగ్య సిద్ధ ప్రశస్త సౌఖ్యదంబగుచు నేఁటిసంక్రాంతి తనరిమనకు
భోగయోగములెల్లఁ బెంపొఁదఁజేసి ఖ్యాత మగుఁగాత! స్వర్ణసంక్రాంతియనఁగ.

నేఁటిసంక్రాంతి లక్ష్మితోపాటు మనకు ఆంధ్రరాష్ట్ర లక్ష్మియుఁగూడ నరుగుదెంచి
మనకుఁ గలిగెడు నానంద మినుమడింపఁజేయుఁ గావుత! నుత్సవ శ్రీలఁగూర్చి.

తెలుఁగులలనలు చిలుకలకొలుకులగుచు హారతు లొసంగుదురుగాక! ఆంధ్రరాష్ట్రి
లక్ష్మికీనాఁటి సంక్రాంతి లక్ష్మిఁగూడి తెలుఁగుదనమది దశదిశల్ దీప్తి నింప.

బులుసు వెంకటేశ్వరులు.

* * *

ఆంధ్రనారీమణి హస్తక్షేత్రమునుండి రంగవల్లీలతలు ప్రాకుచుండ
ఆంధ్ర తేజముఁ జాటి యంధుల కనువిచ్చు గొబ్బిగీతంబుల ఘోష చెలఁగ
'నిత్యకల్యాణమై నెగడగావలె'నంచు పచ్చతోరణపంక్తి పరిఢవిల్ల
మతభేదములమాట మాడ్చివేయఁగబూని మండెననఁగ భోగిమంటలెగయ

కొత్తయల్లుండ్రు కానుకల్ గోరుచుండ పిన్నపెద్దల హృదయముల్ ప్రీతిగొనగ
"ఆంధ్రమాతకు స్వాగతంబ"నుచునిపుడె వచ్చెసంక్రాంతిపండుగు వైభవముగ.

అత్తలయిండ్లకేగి వసనాభరణంబులఁ దృప్తిఁజెందు క్రొం
గ్రొత్తవధూవరాళికిని కూరిమిఁగోరెడు బంధురాజికిన్
మత్తునకైతసేయు కవి మాన్యులకున్ పసిబాల కోటికిన్
పొత్తునుగోరు మిత్రులకు మోదముఁగూర్చుత! పండుగెంతయున్.

కొ..రాధాకృష్ణయ్య.

* * *

ఏపండుగకు రవిఎలమి మకరమందు సంక్రమించుటఁ గడుసౌరుమించు
పంటలన్నియుఁబండి వఱపులెల్లంబోయి ధనికులుబీదలుఁ దనరుచుంద్రు
ఇండ్లముంగిళ్లలో నింపుగాఁ గ్రొంగ్రొత్త ముగ్గులుదీర్చియు మురియుచుంద్రు
నెలగాఁగ ముంగిళ్ళ నెలకొలిపిన గొబ్బెమలకును పూజలు వెలయుమిగుల

తల్లులు తమముద్దుపిల్లల నూత్నవస్త్రాభరణముల నొయ్యారపఱతు
రిల్లాండ్రుగూడ సొమ్ముల్లన్ ధరించి పేరంటములకుఁ జేర రంజిలుదురు
రేఁగుఁబండ్లు సెనగల్చెఱకు ముక్కలుఁ బుఫ్ఫుల్ సంజ బిడ్డలకు బోయంజెలంగు
కోడెలావులకును దూడలకుం గొమ్ములకు గిట్టలకు రం గలందెదరును
గోవులమొగములన్ గుంకుమఁబసపిడి పూలతోఁగావింత్రు పూజనములు
కోళ్లపందెమ్ముఁ బొట్టేళ్లపందెమ్ముఁ గోడెలపందెముల్ గడు టీకుగ నగు
పెద్దలన్ దర్పణ విధులపూజించి విప్రులకును గూష్మాండముల నిడుదురు
సంక్రాంతినాటి భక్ష్యములు భోజ్యములును నందంబు ప్రత్యేకమై చెలంగు

పండుగలయందు సంక్రాంతి పండుగకును సాటిరాదెట్టి పండుగక్ష్మాతలమున
ఇట్టిసంక్రాంతుల నెన్నిటినేని గనగ ఇలను జనుల శ్రీశు డనుగ్రహించుగాక.

దోమా ఇందిరాదేవి



# సంక్రాంతి గీతిక



శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు



స్వాతంత్ర్య సమరంబున బలియై
వీరులు స్వరాజ్యంబును తెచ్చారు;
భారతీయులకు సుఖమునకంటె
ఇక్కట్టులై మిక్కుటమాయె.

స్వరాజ్యంబును సంపాదించి
మూడువత్సరాల్ నిండుగగడిచె;
కష్టపుదినాలు గడువకమున్నె
వచ్చె నదిగో నాల్గవసంక్రాంతి.

పిల్లలు పెద్దలు ఉత్సాహమ్ముగ
ఆడుచుండవలసిన దీసంక్రాంతి;
ఆనందమునకు బదులుగ నాలుగు
వైపుల హా, హాకార ధ్వనులే.

ఎంతమంది ఈ కటికి నేలపై
తిండిలభింపక పడివున్నారో;
ఎంతమంది యీచలి గాడ్పులలో
వడవడ వణకుచు నున్నారో!

మేడల మిద్దెలపై సోఫాలలో
హాయిగ సరససల్లాపములతో
పట్టుశాలువలు తమపైనిడుకొని
హాయిగ సుఖనిద్రలో మునిగారో!

బానిసత్వమయితే తొలగింది;
బాధలు తక్కువ కాలేదుసుమా!
హృదయజ్యోతిలో సమానత్వమే
మెండుగ నిండినపుడె సుఖముండున్.

అప్పటివరకును ఎక్కడచూచిన
దీనాలాపం దుఃఖ స్వరాలే;
అరుణోదయములో భారతీయులకు
వినిపిస్తాయి, కనిపిస్తాయి.

ఏదోవిధముగ చీకుచింతలతో
ఈ సంక్రాంతి వెడలుచున్నది;
సుఖదుఃఖాలే చీకటిరాత్రులు
సంక్రాంతి త్రోవ సంక్రాంతిదే.

ఆంధ్రనారీమతల్లు లదృష్టమోయన
కేసరీ మహాశయుని కనికరమున
మహిళలహాస్తంబుల నలంకరింప
భాగ్యమబ్బె ప్రతి గృహలక్ష్మికి నేడు.

# సంక్రాంతిపండుగప్రాముఖ్యము

శ్రీమతి పంద్రంగి వెంకటలక్ష్మమ్మగారు



హిందువుల మనుమనకు సంవత్సరములో అనేకపండుగలు వినాయక చవితి, నవరాత్రులు (దీనినే దసరా అనిఅందుము) దీపావళి, సంవత్సరాది అనియు ఇంక ఉండ్రాళ్లతద్ది, అట్లతద్ది అనుగోరింటాకు పండుగలు మొదలగునవి ఎన్నోగలవు. ఒక్కొక్కదానికి ఒక్కొక్క ఆచారము జరుపబడును. అందులో సంక్రాంతిపండుగకు బొమ్మలుపెట్టుకొను ఆచారము. పిల్లలు బొమ్మలపండుగనియే చెప్పుదురు. ఈపండుగ పుష్యమాసములో వచ్చును. సంక్రాంతినిగురించి తెలిసినమటుకు సోదరీమణులకు విన్నవించుచున్నాను.

సంక్రాంతిపండుగ దక్షిణాయనములో మార్గశిరమాసమందు ప్రారంభమగును. ఇది ఒకనెల రోజుల పండుగ. అందులో నాలుగురోజులు ముఖ్యము. ప్రారంభమున లోకబాంధవుడగు సూర్యుడు ధనురరాశియందు ప్రవేశించును. అందుచే దీనికి ధనుర్మాసమని పేరు. పెద్దలు నెలరోజులు ఉషఃకాలమున స్నానములు చేయుదురు. దేవాలయములలో భజంత్రీలతో వేదపారాయణలతోను పూజానైవేద్యములు ఊరేగింపులు జరుగును. ఇండ్లలోకూడా ఈవిధముగ పూజలు కొంతమంది భక్తిపరులు చేయుదురు. ఇది ముగ్గులపండుగ అని కూడా చెప్పవచ్చును. బీదసాదలనక ప్రతివారు వాకిళ్లూడ్చి కళాపిచల్లి చక్కని రంగవల్లులు పెడుదురు. ఈ మాసమంతయు వైకుంఠమునకు దార్లుతెరచి ఉండుననియును ఈ నెలలో చనిపోయినవారు తప్పక వైకుంఠమునకు వెళ్లుదురనియును మనశాస్త్రములు చెప్పుచున్నవి. దీనికి దృష్టాంతముగ ముగ్గులకు కూడ నలువైపుల దారులుంచుదురు. గోమయముతో ముద్దలుచేసి పసుపుకుంకుమ పువ్వులతో అలంకరించి పూజానైవేద్యములిచ్చి ముగ్గులలో నలంకరింతురు. వీట్లకు గొబ్బిదేవర అని అందుము. తర్వాత పిడకలుగచేసి ఎండింతురు. ఈ పండుగకు ఎక్కడచూచినను పంటచేలు, కుప్పలు, ధాన్యపురాసులు కలిగి పొలములు నిండియుండును. ఏ యింటచూచినను పల్లెలయందు ధాన్యపురాసులుండును. ఈఋతువులో ముఖ్యముగా పల్లెలలో ఏ యింటికివెళ్లినను బీదలకు అన్నములేదనువారుండరు. ఏ పొలమునకువెళ్లినను తోచినధాన్యము పెట్టని వారుండరు. ప్రతి దొడ్డియందు బంతి, చేమంతి, గుమ్మడి మొదలగు పూలు బంగరు ముద్దలవలెవిరియబూసి కన్నులకానందము గొల్పును. బీర, బంతి, ఆనప మొదలగు అనేకజాతిపువ్వులు గొబ్బెళ్లకు, పనికి వచ్చునవి పుష్కలముగ దొరకును. నెలపొడుగున సున్నముఃలు, జేగుర్లు, అలుకులు, ముగ్గులు, పసుపు కుంకుమలతో ఇళ్లు అలంకరించుచునే యుందురు. హరిభక్తులు తెల్లవారకముందే రాగి అక్షయపాత్రలకు బంతిపూలుచుట్టి, విష్ణులాంఛనములతో తాంబుర చిరుతలు వాయించుకుంటూ, హరికీర్తనలు పాడుతూ ఇంటింటికివత్తురు. వృషభరాజును బట్టలతో అలంకరించి పసుపుకుంకుమలుపెట్టి గంగిరెద్దనిపేరుపెట్టి

వాయిద్యములతో ఇళ్లిల్లు ఊరూరుత్రిప్పి ధాన్యము, బట్టలు సంపాదించుకుంటారు. మంగళ్లు తమ నాగస్వరములతోను వాయిద్య పరికరములతోను పిలువకనే గడపగడపకువచ్చి మేళము చేయుదురు. ఇవన్నియు పెద్దలకు శుభకరముగను, పిల్లలకు మహదానందముగను నుండును. పిల్లలు గుంపుగూడి అన్నం నీళ్లుమరచి వాయిద్యముల వెనకనే తిరుగుదురు. అన్నిపండగలలో ఇది చాలాగొప్పది. బొమ్మలుపెట్టుకొను ఆచారము చూతము. చందనము, లక్క, దంతములోను, ఇత్తడి, కొయ్య ఇంక అనేకవాట్లతోను పలువిధములబొమ్మలు, బొమ్మసామానులు ఈ పండుగకు ప్రత్యేకం ఆయాపని వారు తయారుచేయుదురు. చక్కనిలక్కపని, ముచ్చిపని, చేయుదురు. కుమ్మరిపనికూడ చేసెడివారు. ప్రతివారు క్రొత్తబట్టకట్టుకొనుట నగలుచేయించుకొనుట జరుగును. పండుగకు ఆడపడుచులను, అల్లుళ్లను, కోడళ్లను తీసుకువత్తురు. వేలాది ఖరీదుగల బొమ్మసామానులు పటములు ప్రతియేటా తయారై అమ్ముడుపోవును. పండుగ పుష్యమాసములో ఏతిథియందైనను రావచ్చు. సంక్రాంతిపురుషుడు అను ఒక దైవరూపము మకరసంక్రమణమున ఉత్తరాయణము ప్రవేశించు క్షణమున వచ్చునని మన శాస్త్రములందు చెప్పబడినది. ఆయన అనుగ్రహమున్న మనకు క్షేమమని చెప్పబడినది.

ఇదిగాక శ్రీమహావిష్ణువు వామనావతారమున బలిచక్రవర్తిని పాతాళమునకు అణచివైచి తిరిగి ప్రతి సంవత్సరం పుష్యమాసములో ఉత్తరాయణ పుణ్యకాలమున భూమిపైకి రాగలందుకు వరమిచ్చెనట. అందుచే ఆ సమయమున బలిచక్రవర్తి, సంక్రాంతిపురుషుడు, వీరితో 33 కోట్ల దేవతలు, పితృదేవతలు భూమిపై నల రారుదురని ప్రతీతి. వారికందరకు తర్పణములిచ్చి, దేవపూజలుచేసి దానధర్మములుచేసి పంచభక్ష్యపరమాన్నములను బంధువులతో అతిథి అభ్యాగతులతో భుజించి క్రొత్తబట్టలుకట్టుకొందురు గద! ఈ దేవతలను పురస్కరించుకొనియే దానికి తార్కాణముగ భోగిరోజున ఉదయమే బాలికలు తలంటి పోసుకుని క్రొత్తబట్టలుధరించి బల్లలపై బొమ్మలలంకరించి పూజాహారతులిచ్చి పులగము నైవేద్యము పెట్టుదురు.

ఐదు రోజులు ఈ విధముగ హారతులిత్తురు. పీడాపరిహారముగ చిన్ని పిల్లలకు భోగిపండ్లుపోతురు. బొమ్మలంటే జపాను మొండి బొమ్మలు, అమెరికావి, గాజుముక్కలు, కుక్కలు నక్కలు కాదు. చక్కని తిరుపతి చందనపువి, కొండపల్లి, నక్కపల్లి, కొయ్యలతో చేసి రంగులువేసినవి, ఇత్తడివి. పలుచోట్ల తయారు చేసినవి దశావతారములు ఇతర దేవతా రూపముల బొమ్మలు ముఖ్యముగా పెట్టేవారు. ఇట్లు ముక్కోటి దేవతలకు తార్కాణముగా ఈ బొమ్మలను కొలుచుట వాడుక. గొప్పవారనక బీదవారనక ప్రతివారు ఈ పండుగకు బొమ్మలు పెడుదురు. బీదసాదలకనువగునట్లు పేడతో బొమ్మలుచేసి సహజమైన రూపములుండునట్లు లక్కవేసి అమ్మెడివారు. గృహములలో స్త్రీలు బిడ్డలను కాళ్లమీద పడుకోపెట్టుకొని నీళ్లుపోయుట, నీరుతెచ్చుట, పిల్లలు చెమ్మచెక్కలాడుచున్నట్లు మొదలగు పలువిధములగు రూపములను చేసేవారు. చిన్నచేటలల్లి, వంటసామానులు మట్టితోను లక్కతో చేసి చక్కగరంగులువేసి ఒక్కొక్కటికానీ అర్థణా చొప్పున అమ్మేవారు. ఇప్పుడా పరిశ్రమ పూర్తిగా అడుగంటినదని చెప్పుటకు విచారమే, మన ఇండ్లలో రంగురంగు గుడ్డముక్కలతో గోడసంచులల్లి, పూసలతో ఉట్లు మొదలగు అనేక అల్లికలల్లేవారు. తాటి ఆకులబొమ్మలు చేసి చీరలుకట్టి బొట్టు కాటుక నగలు పెట్టి బల్లలమీద అలంకరించేవారు. మూడవరోజు కనుము; అనగా పశువుల పండుగ. పశువులపాకలు, దొడ్లు ఊడ్చి ముగ్గులుపెట్టి గోవులకు పసుపు బొట్టుపెట్టి పాలుపితుకక దూడలకు వదలుదురు. అంగరక్ష కొరకు చిన్నదూడలకు చెవికొస కత్తిరించుదురు. ఈ రోజు గ్రామదేవతలకు నైవేద్యములు పెట్టుదురు.

# ప్రతి స్నానము మీకు తలంటు యిచ్చే మనుపును యిచ్చును -



కేరళ తలంటు సబ్బుయొక్క శ్రేష్ఠమైన నురుగు మీ చర్మములోనికి, లోతుగాయినికి శుభ్రపరచి, చర్మమునకు అధిక మృదుత్వమును కలుగచేయును. వీటియొక్క శ్రేతమైన, పరిశుద్ధతైలములు, సహజపరిమళములను, క్రిమి సంహారిణిని, చర్మపు క్రింది భాగమునకు లోతుగా కూడకొనిపోయి బాగుగ పనిచేయును. అయినను చన్నీళ్లతో కేరళ సబ్బునురుగును క్షణమాత్రములో కడిగివేసికొనవచ్చును. కేరళ సబ్బుయొక్క శుద్ధమైన పరిమళము స్నానమైనతరువాత గంటలకొలది నిలచును.

## కేరళ సబ్బు

పరిశుద్ధమైన తైలమునుండి తయారైనది



వేప సబ్బులోని క్రిమిసంహారిణి, చల్లనైన, మరియూ, చేదైనగుణములుగల వేపనూనె, ముఖ్యముగా వేసవిలో శరీరసౌఖ్యమునకు రక్షణ.

... ఇన్స్టిట్యూట్, కాలికట్.

పారిశ్రామిక, వాణిజ్య శాఖ

... ప్రభుత్వము

SISTA'S-KS-3 B-TEL




(4)

## జైలు

పూరీ శంకరాచార్యులవారు కొన్నిరోజులే ఉండి "కుంభాభిషేకంనాటికి తిరిగివస్తా"మని చెప్పి వెళ్లిపోయారు. వారువెళ్లాక ప్రసంగవశంగా ఒక భక్తులు భగవానునితో "శంకర పీఠాధిపతులలో ఇక్కడికి వచ్చినది వీరొక్కరేనా?" అన్నారు. "నేను విరూపాక్షగుహలోనుండగా * శివగంగ పీఠాధిపతులొకరు వచ్చారు. వారుప్రస్తుతం శివగంగ పీఠాపధితులుగా వున్నారే, వారితండ్రికి తాత. వారికీ వీరికీ మధ్యన రెండు పీఠాంతరాలున్నవి," అన్నారు భగవాన్. "వారేమయినా భగవానుని ప్రశ్నించారా?" అన్నారా భక్తులు. "ప్రశ్నించుటకేమున్నది. వారు మంచి వివేకం కలవారు, పండితులున్నూ. నన్ను చూచినవెనుక సుఖి అంటే రమణుడేసుఖి. ఈలాంటి సుఖం నాకు వేయిజన్మలకైనా లభించటం దుర్లభం అన్నారట సమీపస్థులతో" నన్నారు భగవాన్.

"వారున్నూ భగవానున్నచోటనే బసచేశారా?" అన్నారాభక్తులు. "లేదులేదు; అదొక విచిత్రమైన సన్నివేశం. వారు శిష్యులతోవచ్చి టవునులోని సత్రమందు బసచేసి నన్నక్కడకు రమ్మని ఆహ్వానించారు. 'మనమేమి పండితులమా పోయేందుకు? ఏమి అర్హత ఉన్న'దని రానన్నాను. వారదివిని తామే శిష్యులతోసహా బయలుదేరి పెద్దపళ్లెంలో సరిగంచు శాలువ, నూటపదునారు రూపాయలూ పెట్టుకొని నావద్దకు రావాలని కొండ ఎక్కుతూ ఉంటే, నేను ములైపాల తీర్థంవద్దనుండి కమండలం పుచ్చుకొని విరూపాక్షగుహకు పోతూఉన్నాను. ఆ మధ్యనున్న వృక్షంవద్ద ఉభయులం సంధించాము.

◆ వారు పళ్ళెం నాముందుంచి స్వీకరించమంటే నేనొప్పలేదు. కడకు డబ్బు వారే తీసుకొని శీతాకాలంలో కప్పుకొనుట కుపయోగపడును; శాలువ స్వీకరించవలసిందని తొందరచేశారు. తిరస్కారంకూడదని అది మాత్రం తీసుకొని సరిగంతా చింపివుంచి అంచులుకుట్టి కప్పుకుంటూవచ్చాను. ఆ సరిగ మొన్నటిదాకా ఉండాలిక్కడే. వారు వెంటనే వెళ్ళారు, అప్పటికే చాలావృద్ధులు. ఇక్కడికి వచ్చివెళ్లిన కొద్దిరోజులకే సిద్ధిపొందారు, అన్నారు భగవాన్.

"శృంగేరీ పీఠాధిపతులెవ్వరూ రాలేదా?" అన్నారా భక్తులు.

"లేదు. నృసింహభారతుల వారుండగా రావాలని చాలాసార్లు యత్నించారు. నన్ను గురించి ఎప్పుడూ 'ఆ బ్రాహ్మణస్వామి సుఖంగా వున్నాడా' అని అడుగుతూ వుండేవారట" అన్నారు భగవాన్. "వారు ఆంధ్రులా?" అన్నా నేను.

"అవును; ఏమి?" అన్నారు భగవాన్. "నృసింహభారతి అనేవారు తెలుగులో మంచి రసవత్తరంగానూ ఆధ్యాత్మికంగానూ దేవీనక్షత్రమాలా కీర్తనలు వ్రాశారు. వారు వీరేనా ఏమని అడిగా" నన్నాను. "ఉండవచ్చును. వారు పండితులు, కవులున్నూ" అన్నారు భగవాక్. "వారు రావాలని యత్నించిగూడా ఎందుకు రాలేదో?" అన్నారా భక్తులు.

"ఏమున్నదీ? పీఠాధిపతులాయె. ఎన్నో నిబంధనలు. చుట్టూ ఉన్నవారు వకమాత్రాన రానిస్తారా?" అన్నారు భగవాన్. "చుట్టూఉన్నవారేం జేస్తారు భగవాన్. చిత్రంగా చెప్తారే" అన్నారా భక్తులు. "ఏంజేస్తారా? చూడండి; ఇప్పుడు మనస్థితి ఎట్లాగున్నదో. జైలువార్డుకు పెట్టినట్లే చుట్టూ కఱ్ఱ

కటకటాలు పెట్టారు. గిరిగీచినట్లిది దాటరాదు. ఒకరువిడిస్తే వకరు కాపలా. కదిలామంటే కపడ్ దార్. డ్యూటీ ప్రకారం, అరుగోవారు వస్తున్నారు; వీరు వెళుతున్నారు. ద్రస్సులేదనన్నమాటేగాని, పోలీసులకూ, వీరికీ, ఏం భేధమున్నదీ? వారి అధీనంలో మనమున్నాము. లఘు శంకకు పోదామన్నా వెనక కాపలా తప్పదు. అదీ టయిం ప్రకారమే లేవాలి. ఎవరుగానీ ఆఫీసులో పర్మిషన్ తెచ్చుకుంటేనే ఏదైనా చదవాలి, మాట్లాడాలిగాని లేకుంటేలేదు. దీన్నేమంటారు? జైలుకూ దీనికీ ఏం భేధం. ఇంచుమించువారికి ఇంతే. మఠాధిపత్యమంటే అదీ ఒక జైలే. వారేం జేస్తారుపాపం" అన్నారు భగవాన్.

"ఇందుకే ఈశ్వరుడికి భక్తపరాధీనుడన్నపేరు వచ్చింది కాబోలు" అన్నానేను. "అవును స్వామిత్వానికే ఇంతపాటుంటే వారిమాట చెప్పాలా? ఎవరు ఏపేరుపిలిస్తే ఆ పేరున పలకాలి. ఏరూపంతో రమ్మంటే ఆ రూపంతో రావాలి. ఎక్కడ ఉండమంటే అక్కడ వుండాలి. అడుగుదాటి కదలరాదంటే అట్లాగే నిలిచిపోవాలి. పరాధీనతగాక వారికేం స్వతంత్రత ఉన్నది" అన్నారు భగవాన్. (22-12-48)

---

* శివగంగ పీఠం శృంగేరికి బ్రాంచి.

♦ పైన భగవాన్ సెలవిచ్చినట్లుగా సమావేశం కాబోతూవుంటే, సమీపస్థులందరూ ఎవరెవరికి నమస్కరిస్తారోనని చూస్తూ వున్నారనీ, భగవానుని తేజోమయ విగ్రహమును తిలకించుచూ వారిని సమీపించుసరికి ఆ ఆచార్యులవారి హస్తములు అప్రయత్నంగానే ఒకదానినొకటి దరిసి వందనమాచరించినవనీ, ఇటీవల ఒక భక్తునివలన విన్నాను.

[గమనిక : లోగడ సంచికలో ప్రచురించిన లేఖల తేదులు పొరబాటున పంపబడక ప్రచురింపబడలేదు. గురుకృప 23-4-48 నాటిది. పరస్పర శాపములు 18-12-48 నాటిది. గృ. సం.]



# శ్రీ రమణ వర్ధంతి, శ్రీ గీతా వర్ధంతి

ఈ 25-12-50 న శ్రీ భగవాన్ రమణమహర్షి జన్మదినోత్సవము. శ్రీ గీతా వర్ధంతికూడా కలిసివచ్చినది. ఆ రోజే పునర్వసు నక్షత్రం కావడంచేత శ్రీ దోర్బల శోభనాద్రిశాస్త్రిగారింట్లో మాసవారీగా జరిగే శ్రీ వేంకట రమణ స్మరణకూడా తటస్థించింది. ఇవన్నీ ఆ రోజున వారింట్లో చాలా జయప్రదంగా జరిగాయి. గౌ. జస్టిస్ శ్రీ చింతగుంట రాఘవరావుపంతులుగారు అధ్యక్షత వహించారు.

శ్రీ భగవాన్ ఆజ్ఞ, అనుమతివడసి సంవత్సరానికి పైననే శాస్త్రిగారింట శ్రీ కల్లూరి వీరభద్ర శాస్త్రిగారు గీతాకాలక్షేపం ప్రారంభించారు. అది ఆ ముందురోజే ముగిసింది. దానికిన్నీ గీతాజయంత్యుత్సవం రోజున సమాప్తిచెప్పబడినది. కాలక్షేపం గావించిన శ్రీ వీరభద్రశాస్త్రిగారినిఇన్నాళ్లు ముఖ్య శ్రోతలుగానుండిన శాస్త్రి, నరసింహరాజుగార్లు మున్నగుపెద్దలు కొందరు అర్ధనూట పదహార్లతోను, నూతనవస్త్రములతోను సత్కరించారు. ఆ సమయాననే శ్రీ మునగాల రాజాగారు, అలపాటి వటుంబరావు (బెజవాడ) గార్లు చెరి 25 రూ॥లున్నూ, ఈదర వెంకట్రావుపంతులుగారు (వేంకట్రామా అండుకో) 116 న్నూ శాస్త్రిగారికి కానుక నిచ్చారు. శ్రీ రమణమహర్షులవారు శ్రీ మద్భగవద్గీతలో సారయుతమైన దాదాపు 40 శ్లోకములనేర్చి కూర్చారు. వానికి శ్రీ వీరభద్ర శాస్త్రిగారే తెలుగున వ్యాఖ్యానం వ్రాశారు. దానినిన్నీ ముందు రోజు గీతకాలక్షేపం ముగింపుతోపాటు చదువగా విన్న శ్రీ ఈదర వేంకట్రావుగారు దాని నచ్చువేసే భారమును తాము వహించారుట.

ఈ విధంగా శ్రీ భగవానుల నిర్యాణానంతరం జరిగిన ప్రథమ వర్ధంతి యుత్సవం ఇన్ని ఉపకార్యక్రమాలతో ఉత్సవాలతో జయప్రదంగా జరిగింది. శ్రీ రమణభక్తు లనేకమంది దయచేసి మహర్షుల పటములకు మొక్కి ప్రసాదం స్వీకరించినారు.






# అవయల్

## కూరగాయల దినుసులు

| మునగకాయ 1 అణా | మామిడికాయ 1 అణా |
|---|---|
| అరటికాయ 1 అణా | దోసకాయ 1 టి |
| చామదుంపలు 5 తులములు | బంగాళదుంపలు 5 తులములు |
| గోరుచిక్కుడు 5 తు | కందదుంపలు 5 తు |
| పెద్దచిక్కుడు 5 తు | పెద్దగుమ్మడి (పెండ్లిగుమ్మడి) 5 తు |
| వంకాయ 5 తులములు | గడ్డకోసు 1 టి |
| మొలకకూర లేతది 1 అణా | బెండకాయలు 3 తులములు. |

పైనచెప్పిన కూరగాయలను శుభ్రపరచి దబ్బలుచేసి తగినంత పెద్దపాత్రలో వేయవలెను. ఆవెనక కాస్త చింతపులుసు, తగినంతవుప్పు, చంచా పసుపుపొడివేసి, తగినంతనీళ్లుపోసి మెత్తగవుడికించుకొని మిగిలి వున్న నీరు వంచివేయవలెను. ఆతరువాత 1 పడి పుల్లటిపెరుగు చిలికి వుడికివున్న దబ్బలలోపోయవలెను. చాల సన్న కాస్తవుప్పు పసుపువేసి మళ్ళీవుడికించవలెను. ఆతరువాత పచ్చికొబ్బరి కోరుకొని ఎండుమిరప కాయలు 1 తులము కాస్తపచ్చిశొంఠి చిటికెడు జిలకఱ, మిరియమంత ఇంగువ, అన్నిరోటవేసి మెత్తగరుబ్బి మసలుతుండే పెరుగు, దబ్బలలోవేసి బాగా గరిటతో కలియపెట్టవలెను. 10 నిమిషములు వుడికినతరువాత 3 తులములు కొబ్బరినూనె, కాస్త కరివేపాకువేసి తీసి వుపయోగించవలెను.

## విజిటబల్ బాత్

గోధుమరవ 2 అళాకులు శుభ్రపరచి సువాసన వచ్చువరకు వేయించి తీసి ఉంచవలెను. ఎఱ్ఱదుంపలు ¼ వీశ, బంగాళదుంపలు 1/8 వీశ, ఎఱ్ఱగుళ్ళంగి 1, దోసకాయ 1, తెల్లగుళ్ళంగి 1 టి, గడ్డకోసు 1 టి, ఆకుకోసు 1 అణా, 1అణా వంకాయ, 1 అణా చిక్కుడుకాయ (గోరుచిక్కుడు) 1 అణా లేత తోటకూర (దంటుకూర) పచ్చిపఠాణిగింజలు 1 అళాకు, సీమవంగ (టమేటో 1 టి) పచ్చిమిరపకాయలు 5 లేక 6. ఆపైన చెప్పినకూరగాయలను సన్నగ దబ్బలుచేసి ఉంచవలెను.

| సోంపు (పెద్దజీలకర) 1 అణా | ఎండుకొబ్బరి 1 టికోరి ఉంచుకోవలెను. |
|---|---|
| మరాటిమొగ్గ 1 అణా | దాళిచిన్ని (లవంగపట్ట 1 అ) |
| గసగసాలు 1 అళాకు | ధనియాలు 1 అణా |
| ఎండుమిరపకాయలు 5 తులములు | సెనగపప్పు 1 అళాకు |

పైనచెప్పిన మసాలాసామానులను నేతితో లేక నూనెతో సువాసన వచ్చువరకు వేయించితీసి వుంచుకోవలెను. ఆ తరువాత తగినంత కంచుపాత్రలో రెండుతులములు మంచి నూనెవేసి బాగాకాగిన తరువాత 1 చంచా ఆవాలువేసి చిటపట అనగానే తరిగివుంచుకొనిన దబ్బలనువేసి 1 పడినీళ్లుపోసి తగినంతవుప్పు 1 చంచా పసుపుపొడివేసి కలియపెట్టి మూసివుంచవలెను. బాగవుడికిన తరువాత పైనచెప్పిన మసాలను పొడి చేసి 5, 6 చంచాలువేసి, కాస్త కరివేపాకు, కొతిమిరిఆకు, నిమ్మపండు 1టి రసము తీసివేసి దబ్బలు

మెత్తగా వుడికినతరువాత వేయించి వుంచిన రవనువేసి కలియబెట్టి మూసిఉంచవలెను. రవచక్కగా వుడికిన తరువాత రెండు తులములు నెయ్యి, 2 తులములు జీడిపప్పువేసి కలిపితీసి వుపయోగించవలెను. ఇదిచాలా రుచికరముగా నుండును.

## గుమ్మడికాయ బరిఫీ

¼ వీశ కోడగుమ్మడి (తియ్యగుమ్మడి) పండు తీసుకొని, కొబ్బరితురుములోకోరి నీరువడియునటు పిండి ఉంచవలెను. ఆ వెనుక ¼ అళాకు నెయ్యివేసి బాగాకాగినతరువాత (బాణలిలో) పిండి వుంచుకొనిన కోరునువేసి సువాసనవచ్చువరకు వేయించి తీసి ఉంచవలెను.

ఒక కంచుపాత్రలో ¼ వీశ పంచదారవేసి ¼ అళాకునీళ్లుపోసి బాగా పాకమైనతరువాత వేయించి వున్నగుమ్మడికోరు 2 తులములు పిస్తాపప్పు, 2 తులములు సారపప్పు, కాస్త ఏలకపొడి, చిటికెడు కుంకుమ పూవు (కేసరి) వేసి 10 నిమిషములు బాగావుడికిన తరువాత ఒక పళ్ళెమునకు 1 చంచానెయిరాసి దానిలో గుమ్మడిపాకమును పోయవలెను. కొంతసేపు ఆరినతరువాత ముక్కలుకోసి వేసి వుపయోగించవలెను. ఇవి చాలా బాగావుండును.

ఎమ్. ఆర్. సీతమ్మ.




**తుమ్మిపూలు :-** తుమ్మిపూలయందు మకరంధము, మధుపూరిత మయిన చమురు కలదు. పిల్లలకుగాని, పెద్దలకుగాని కండ్ల మెరుపులు, దురదలు, పలుమారు కనురెప్పలు అంటుకొనుట, పుండ్లగుట, మంట, గుల్లలువేయుట చూచు చుందుము. అట్టివాటికి తుమ్మిపూలను వేళ్లతో నలిపి, వేళ్లకు అంటిన రసమును కంటిరెప్పలకు కాటుకవలె పెట్టుకొనిన ఏ బాధయులేక నెమ్మదించును.

మరియు పూలరసముతో కొద్దిగతేనె, బోరాక్సుచేర్చి 5 చుక్కలు మొదలు 15 చుక్కలవరకు చంటి బిడ్డలకు కలుగు పడిశెము, ముక్కురంధ్ర ములు బిగియుట, ముక్కులు ఆరిపోయి దిక్కులు కట్టి ఎరుపులుగ కాన్పించుట అనువానికి ఉపయోగించుట మంచిది.

శీతలము, వాయువు హరించుటకు: ఖర్జూరపు కాయలను చితుకగొట్టి నీళ్లలో వేయవలయును. నాసిన పిమ్మట పడియ గట్టవలయును. షుమారు ½ ఔన్సు నీళ్లలో తుమ్మి పూలరసము 5,6 చుక్కలు వేసి రోజుకు రెండు పర్యా యము లిచ్చిన అజీర్ణవాతము డొక్కలు ఎగురవేయుట, అవయవములు చంటిబిడ్డ చేష్టలవల్ల బిగియుట మొదలైనవి తగ్గును.

తుమ్మియాకు రసమును ముక్కులలో పిండిన సర్పవిషములును హరించును. కరచినచోట తుమ్మియాకు చితుకగొట్టి కట్టుట మంచిది. పొలము లలో అడవులలో సంచరించు వారికి సర్పదష్టము, విషక్రిములు నాకుట లేక కరచుట మొదలగు వానికి ఇది ప్రశస్తమయిన ప్రథమచికిత్స. యీ విషయము కర్షకులకు బాగుగ తెలియును.

---

# ఇంటిపనులలో మెళుకువలు

(గత సంచిక తరువాయి)

---o---

(సత్యభామ సంభ్రమాశ్చర్యములతో చెవియొగ్గివింటూ ఉండగా ద్రౌపతి ఇంకా ఇలా చెప్పింది.)

ద్రౌ ప తి

ప్రజలందరిచేత మ్రొక్కబడేవాడు ధర్మరాజు; ఆయన పంక్తిన రోజూ భోంచేశేవారు అతి పుణ్యాత్ములైన బ్రాహ్మణులు 8000 మంది; ఉజ్వలమైన తేజోవిరాజితమైన బుద్ధివిశేషంగల యతులు 10,000 మంది. వీరందరికి తినడానికి బంగారు పళ్లెములు అమర్చబడతాయి. ఇలాంటి అతిధులందరికి ప్రతి రోజూ అన్నపానాలను, తగువారి సహాయంతో నేనే పూనికతో తయారుచేస్తాను. వారందరికి వారివారి కుచితమైన గుడ్డలు, సొమ్ములుఇచ్చి వారిని తృప్తులను గావిస్తూంటాను.

ఇంకా ధర్మరాజు నగళ్లలో వజ్రాలు వైఢూర్యాలు మొదలైన నవరత్నాలు చెక్కిన బంగారపు నగలు ధరించి వివిధమైనపనులు సరఫరాలుచేసే పరిచారకులు 10,000 మంది; ఇంకో అంతమంది రాత్రిం బగళ్లు శాకపాకములు, శాల్యన్నములు నిండిన వడ్డనపాత్రలను చేతబుచ్చుకోని అభ్యాగతులకు భోజనాలు పెట్టేవారు. ఈ 20,000 మందిలో వీరు, వీరు ఈ, ఈ మెళుకువతో పనిచేస్తారు; వీరిది చేశారు; ఇది చేయలేదు; అనే వివరాలన్నిటిని నేనే స్వయంగా తెలుసుకుంటాను. సర్వదా చెక్కిళ్ల వెంట మదం కారుతూ ఉండే ఉత్తమజాతి ఏనుగలు 1,00,000, అట్లాగే అతిశయించిన వేగంతోపోగల మేలైన జాతి గుఱ్ఱాలు 1,00,000, ధర్మరాజుగారి దివాణంలో ఉన్నాయి. వీటన్నిటికి ఏరోజుకు ఏయేమేత వేయాలో, ఏమేమి దాణాపెట్టాలో - ఏలావాటిని అదుపాజ్ఞలనుంచాలో అందుకుతగిన వారెవరెవరో నేనేచూచి నియమిస్తుంటాను.

ధర్మరాజులుంగారి అంతులేని కోశాగారాలలో లెక్కింపడానికి సాధ్యంగాని నవరత్నాలు, బంగారము ఉన్నాయి; వాటి వివరమంతా నాకెరుకే. ఏఏరోజుల ఎంతెంత ఆదాయం, ఎంతెంతఖర్చు అనేవివరమున్నూ నాకు తెలుసు. ఆవులమేపే గొల్లవాళ్లవరకు అన్ని రకాల సేవకుల జీతనాతాలు నేనుతెలిసి నిర్ణయించి నడుపుతూ ఉంటాను. మితిమీరిన యశస్సే ధనముగాగల పాండుకుమారులు తమ కుటుంబ భారాన్నంతా నామీదవదలి ఏమాత్రము భారములేకుండ తమకిష్టమైన విద్యావినోదములందు గడుపుతూ ఉంటారు; నేనేమాత్రమున్నూ ఏమారక గృహకృత్యములను, రాచకార్యములను చూచుకుంటూ ఉంటాను. వేకువఝామునసే నేను నిద్రలేస్తాను; కాని ఈ రాజ్యభార కార్యములచేత నాకు నిద్రపోవడానికి, అన్నం తినడానికి కూడ ఎప్పుడూ సందే దొరకదు, కమలములవంటి కన్నులుగలవదినా! ఈ విధమైన చర్యలచేత పాండవుల మనస్సులను హరించగల్గినాను గాని, ఓ మగువా! నీవన్న ఆ మందులు, మాకులు, ఇంద్రజాలాలు నాకేమీ తెలేవు.

(స శే ష ము)

# బ్రతుకు తెరువు

ఆంధ్ర గృహలక్ష్ములకు మేము చిరకాలముగా "బ్రతుకుతెరువు" నవలంబింపు డని చెవినిల్లు కట్టుకొని పోరుచున్నాముగదా. దాని ప్రభావమేపాటిదో అమెరికానుండి వచ్చిన ఈ వార్త తేటపరచుచున్నది.

అమెరికా ఐశ్వర్యవంతమైన దేశము. అచట ధనాఢ్యులగు స్త్రీ పురుషులు భోగవిలాసలాలసులు. వారు అందమైన వస్తువును కొనకుండ విడువరు. మనకా, విదేశ వర్తకమునకు డాలర్లు అత్యవసరమై యున్నవి. మనసరుకు అమ్ముకొన్నగాని డాలర్లు లభింపవు.

అందుకుగాను మనప్రభుత్వమువారొక చక్కని ఉపాయమును పన్నినారు. న్యూఢిల్లీలో కుటీర పరిశ్రమల ఎగుమతి కమిటీ నేర్పరచినారు. దాని ప్రతినిధులలో ముఖ్యులైన శ్రీమతి శివరావుసతి, శ్రీమతి బి. కె. నెహ్రూసతి అమెరికాలో ప్రయత్నము చేసి వాషింగ్టన్ నగరమందలి యొకపెద్ద స్టోరునందు "భారతీయ కుటీర పరిశ్రమల" కొక భాగమును ప్రత్యేకింపించి అందు వీనిని ప్రదర్శించినారు; చాల అమ్మకమునకు ఉంచినారు. క్రిస్మస్ పండుగకు సంతచేయుచున్న అమెరికన్ యువతీ యువకులు వీనిని అతి ఆప్యాయముగ ఆత్రముగ కొనివేయుచున్నారట.

ఇప్పటికి, కొద్దిరోజులలోనే, 6000 డాలర్ల సరుకు (అంటే దాదాపు 20,000 రూ॥లు) అమ్ముడు పోయింది. అందులోను తిరునెల్వేలి మెత్తటి చాపలు, ఇత్తడి పాత్రలు చేతులమీద ఎగురగొట్టుకొని వెళ్లినారు. ఇంకా కావాలంటున్నారుట.

చికాగోలో జరిగిన (ఇదీ అమెరికాలో పట్నమే) అంతర్జాతీయ ప్రదర్శనంలో ఈ ఇరువురు నారీమణులు భారతీయ కుటీర పరిశ్రమల ఎగుమతి కమిటీ తరపున వీనిని ప్రదర్శించినారు. నమూనాలక్రిందఉన్న సరుకునే గిరాకీనిచూచి వీరు చాలవరకు అమ్మివేయవలసి వచ్చినదట. "వెంటనే సరుకు కావాలి" అని కొందరు కోరడంచేత మన వారు ఆర్డరు పుచ్చుకోలేక పోయినారుటకూడ.

వీరెంత శ్రమపడి దీనిని ఏర్పాటుచేశారో తెలుసుకోవాలి. అమెరికావారికి మన గృహపరిశ్రమలమీద మోజు అని తెలిసింది. ఈ కమిటీవారు 'ముఖ్యంగా అమెరికా వారి కెలాంటి సరుకులు నచ్చుతాయో' అని యోచించినారు. ఈ కమిటీ సభ్యురాలైన శ్రీమతి ఛేరిసతిని భారతదేశమంతాతిరిగి ఆయాకుటీర పరిశ్రమలను అమెరికావారి కనుకూలమైన వానిని గమనించి రమ్మన్నారు. ఇందుకుగాను ఢిల్లీలో అమెరికానుంచివచ్చిన

రాయబారి శిబిరానికి చెందిన ఉద్యోగి సాకోలాఫ్ భార్యామణిని ఆమెకు జతగూర్చారు. ఆమె అమెరికావారి కేమేమి నచ్చుతాయో చెప్పింది.

ఇప్పుడక్కడ ఎలాంటి సరుకులకు చెలామణో చూడండి. వస్త్రాలు, (ఇందుల్లో చీరెలు, సరిగపూలువేసినపట్టు, ద్వారాలకు తెరలు వగైరాయైన నూలుగుడ్డలు, ఉన్నవి) తిరువాన్కూరు దంతపు పనులు, మైసూరు గంధపు చెక్కమీది నగిషీ పనులు, దక్షిణ భారతదేశంలో ఎద్దుకొమ్ములతో చేసే మృగాల బొమ్మలు, కొయ్యమీద చెక్కడపు పనులు, కాశ్మీరశాలువలు, అగరువత్తులు, బొంబాయి చెప్పులు, స్త్రీలు పట్టుకోవడానికి జరీఅంచులల్లి తయారుచేసిన వెల్వెట్ చేసంచులు, పూసలు, స్త్రీల సంస్థలలో తయారయ్యే మెత్తటి బొమ్మలు, నగలు మొదలైన అనేక విధములగు అలంకార వస్తువులు, తిరునెల్వేలి మెత్తని చాపలు.

ఇందులో వకరహస్యంగూడాఉన్నది. ఏసరుకైనా-సరసమైనధరకు మించరాదు; అంటేవారి అయిశ్వర్యాన్నిబట్టి 10 డాలర్లలోపున (రు 30-లు) వుంటే వారికి నచ్చుతుంది.

ఇంకా పరిశోధిస్తే-అనేక వస్తువులు అక్కడ చలామణీ కావచ్చు అని తోస్తుంది. కొండపల్లి బొమ్మలు, నక్కపిల్లి బొమ్మలు, కంచుపాత్రలు, ఎన్నో ఉన్నవి. మన సాంఘిక పరిస్థితులు తెల్పేవి, వారి సాంఘిక పరిస్థితులు తెల్పేవి ఎన్నో విధాలుగా కొండపల్లి బొమ్మల సెట్టులతో చేయించవచ్చు.

ముఖ్యంగా మన గృహలక్ష్ములు-తాము స్కూళ్లల్లో నేర్చుకున్న అల్లికలు, కుట్టుపనులు మరవకుండా ఇండ్లల్లోకూడా వాకిటి తెరలు, పడకపై దుప్పట్లు, దిండుగలీబులు ఇల్లాంటివికుట్టి, వానిపై పట్టు, జరీఅల్లి పైవారికి సప్లైచేయవచ్చు. మహిళా సంఘాలు వీటిని బాగా సన్నాహపరచి పైకమిటీవారితో సంబంధ మేర్పరచుకొని గృహలక్ష్ముల బ్రతుకు తెరువునకు సుస్థిరమైన మార్గము కల్పించవచ్చు.

# ఆర్థికహక్కు లేని ఆడబ్రతుకు

శ్రీమతి టి. వి. రత్నావళిగారు

"ఏమండీ! ఇదిగో టిఫిన్ తీసుకోండి." అంది సుబ్బులు భర్తతో.

"నాకక్కరలేదు, నువ్వు నీపిల్లలు తిన్నారుగదా! మీకు నాకు గూడా యెలావస్తుంది" అన్నాడు సుబ్బులు భర్త వెంకటరాజు.

"ప్రొద్దున్న పదిగంటలకు భోంచేసి వెళ్లారు. ఇప్పుడు ఐదైంది. రోజూ ప్రొద్దున్న సాయంత్రం గూడా ఆఫీసు అంతదూరం నడిచివెళ్లి నడిచి వస్తారు." అంది. "నీకేమైనా జాలా? నేను మా అమ్మ యెలాగ పోతే నీకేం? కష్టపడి సంపాదించడం నావంతు, అది తగలెయ్యడం నీవంతు" అని ఆట్టేగొడవ పెరగ నీయకుండా పైన ఖండువా వేసుకొని వీధిలోకి వెళ్లిపోయాడు.

వెంకట్రాజుకి మూడేళ్లప్పుడే తండ్రి చచ్చిపోయాడు. అప్పటినుంచి తల్లే అతన్ని పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు నేర్పించింది జీజాబాయిలాగే కష్టపడి. భర్తపోగానే వంటినున్న బంగారమంతా అమ్మి వడ్డీ కేసుకుని, అతిపొదుపుగా కాలక్షేపం చేసింది. అన్నదమ్ములున్నా శుద్ధపల్లెటూరివాళ్లు వ్యవసాయమే వాళ్ల ముఖ్యవృత్తి. చెల్లెలను అప్పుడప్పుడు వచ్చి చూసి పోతూండేవారు. గానీ యేవిధమైన సహాయం చేసేవారు గారు. సెలవులకిమాత్రం తల్లికొడుకు అన్నదమ్ములిండ్లలో కాలక్షేపం చేసేవారు. ఆమె పెద్దన్నగార్కి నలుగురు కూతుళ్లు, నలుగురు కొడుకులూను. గానీ ఒక్కళ్లకి పొట్టవిప్పితే అక్షరంముక్క లేదు. రావమ్మ ఆడదైనప్పటికి చాలా తెలివైంది, సూక్ష్మబుద్ధిగలదీను. మంచినీళ్లు త్రాగినా పంచభక్ష్యాన్నములు తిన్నట్లే నటించేదిగాని యెన్నడు, యెవరితోను యేవిధమైన కష్టసుఖాలు చెప్పుకునేది గాదు. కొడుకుని విద్యావంతునిగా చేయడమే ఆమె మొదటి లక్ష్యం.

వెంకటరాజుగూడా శివాజీలాగే మాతృభక్తుడు. తెలివిగలవాడు, బుద్ధిమంతుడు. తల్లికి ఆశాభంగము కలుగచేయకుండ ప్రతి సంవత్సరము పరీక్షలలో జయము పొందేవాడు. తల్లిమాటకు జవదాటేవాడు గాడు. ఏపనిచెప్పినా అడుగులకు మడుగులొత్తుతూ శిరసావహించేవాడు. ఇతనికి ఆస్తిపాస్తులు లేకపోయినను విద్యాబుద్ధులను చూచి పెద్దమేనమామ పదహారవ యేటే తనపిల్లనిచ్చి పెళ్లి తనేచేశాడు.

బి. ఏ. పాస్ కాగానే అతని అదృష్టంకొద్దీ వుద్యోగం దొరికిందతనికి. ఆ రోజులలో గవర్నమెంటు వుద్యోగస్థులకి రూ 116 లు జీతమే. వుద్యోగం అయేటప్పటికే అతనికొక కొడుకు. మద్రాసులోపని. తనూ తల్లి, భార్య కొడుకు.

అతను అతి జాగ్రత్తగా కాలక్షేపంచేసి అందులోనే పదో పన్నెండో మిగిల్చి బ్యాంకిలో వేసేవాడు. అతని భార్య సుబ్బులు సాధారణంగా మూడోనెల కడుపుతో పుట్టింటికివెళ్లి, పిల్లకు యే యేడో నెలనో తిరిగివచ్చేది. పట్టుమని ఆరునెలలైనా యెప్పుడు యిక్కడ వుండేదిగాదు. పురుళ్లవంకో పెళ్లిళ్ల వంకో పెట్టుకొని వెళ్లిపోతూండేది పుట్టింటికి.

ఇప్పటికి యేడెనిమిది పురుళ్లైనాయి. సగందక్కకున్నా, సగంమందివున్నారు. పెద్దవాడు 15 యేళ్ల వాడు; రెండోపిల్ల పదమూడేళ్ళదీను, మూడోపిల్ల పదేళ్లు, నాలుగోపిల్ల మూడేళ్లు.

సుబ్బులు పల్లెటూళ్ళోపుట్టినా, పట్నవాసంలోనే కాపరంచెయ్యవలసి వచ్చింది. ఇప్పటికి భర్తకి గూడా రూ 200 లు జీతమైంది. పిల్లవాడు వోడుగికి, పిల్ల పెళ్లికి యెదిగారు. గానీ పిల్లకెక్కడా ముక్కులో ముల్లు, చెవులోపుల్లాలేవు. దీపస్తంభంలాగుంది. ఏదోజీతంలేని స్కూల్లోనే ఐదోతరగతి చదువుతూంది. వానాకాలంచదువేను. సుబ్బులు తనమెళ్లో పెళ్లికి పెట్టిన పాతిక కాసులకంటె, మూడుకాసుల మురుగులు చేరిపించమని రాత్రింబగళ్లు గోలచేసేది. గాని ఆమె అరుపులన్నీ అరణ్యరోదనలు అయిపోయేవి.

"ఎందుకురా అబ్బాయి! నగలు చేరిపించడం, ఉక్కలాగున్నాయి, కూలిదండగ...అంటే"

"ఔనమ్మా! భళాభళీ" అనేవాడు కొడుకు. ఎక్కడికైనా పేరంటం వెడితే "ఏమండీ! యింకా ఆ కంటే మురుగులు పట్టుకుని వేళ్లాడుతున్నారటండీ?" అనేవారు పేరంటాళ్లు.

"మొగుడుజీతం యెక్కువైనా ఒక్కలాగే వున్నావమ్మా యింకాను" అనేది మరోకావిడ.

"మీరింకా రూ 12 వాటా వదలలేక పోతున్నారాయేమిటమ్మా" అనేది యింకోకావిడ.

"పిల్ల పెళ్లికెదిగింది; ముక్కులో ముల్లు, చెవులబెండులేదు. మీ ఆయనకి తెలియక పోతే ఆడదిగదా మీ అత్తగారికన్నా తెలియవద్దుటమ్మా" అని అందరు బుగ్గలు నొక్కుకునేవారు.

ఈ మాటలతో తలబరువెక్కి యింట్లో అత్తగారిమీద నిప్పులు గురిపించేది, సుబ్బులు. తల్లిమీద ఈగవాలనియ్యడు భర్త.

అత్తగారు, భర్తగూడా పిసిని గొట్టులో ఘటురకం. యేపూట కాపూట భోజనంతప్ప నోరు మెదిపే వారుగారు. పిల్లలెదిగారు, "అమ్మా ఆకలేస్తూంది యేమన్నా పెట్టవే" అంటే యేంజేస్తుంది తల్లి? ఇంట్లో తల్లి కొడుకులిద్దరు కేష్‌కీపర్లు. సుబ్బులు కాయింట్లో యేవిధమైన హక్కులూ లేవు. ఎప్పుడైనా డబ్బు అడిగితే పిల్లలున్నాసరే యెదురుగుండా యెవరున్నాసరే కసిరి కొట్టేవాడు. సుబ్బులు సామభేద దాన దండోపాయాలు చేసినా లాభంలేకపోయింది. ఆఖరకి మొండికత్తి పోయింది. ఇంటినిండా బియ్యముండేవి. ప్రతిరోజు బియ్యంతో యేదోక టిఫిన్ చెయ్యడం ప్రారంభించింది. ఇంట్లోవున్న నూనె బియ్యం అయిపోతున్నాయని అత్తగారు గోలచేస్తున్నా లక్ష్యపెట్టేదిగాదు. తన కాఫీకి డబ్బులు కావలసినప్పుడు భర్త జేబులో డబ్బులు దొంగిలించో లేకపోతే చాటుగా బియ్యం అమ్మో కాఫీగింజలు, పంచదారా కొనుక్కునేది. భర్త కళ్లబడితే బడితెపూజ చేసేవాడు. దెబ్బలకి శరీరమిచ్చేదిగానీ తనపట్టు మాత్రం విడిచేదిగాదు. నలుగురిళ్లల్లోను తనువెళ్లి కాఫీత్రాగి వాళ్లు తనింటికొచ్చినప్పుడు యివ్వకపోతే యెట్లా? అత్తగారు గ్రుడ్లు అప్పజెప్పి చూస్తూకూర్చునేది. కానీ కొడుకుతో చెబితే పులుసులోకైనా యెముకలేకుండా తన్ని బయటికి తరిమేస్తాడని తెలుసు. నలుగురిలోను నగుబాట్లు చెందడం ఆమెకిష్టముండేదిగాదు. నలుగురిలాగే గొప్పగావుండాలని కోడలికుండేది. ఎవళ్లేమనుకున్నాసరే బాంకి నిండబెట్టడమే ఆ తల్లికొడుకుల పని.

"ఏమండి మనపిల్లకి పెళ్లీడొచ్చింది, సంగీతం చెప్పించండి" అంటే

"ఎందుకనవసరంగా డబ్బుఖర్చు." అనేవాడు.

"నెలకు రెండువందలు తెచ్చుకుంటూ కూడా, దండగేమిటండీ" అనేది.

"ఔను, నీకేం? రేపు దానిమొహాన్ని వెయ్యిన్నీ నూటపదహార్లు పోస్తేనేగాని పెళ్లికొడుకురాడు. పైగా వెయ్యింటేనేగాని పెళ్లి ఒడుగు గావు. నీకేం చెబుతావు, కష్టబడి సంపాదించే వాళ్లకి తెలుస్తుందావిలువ" అని మండి పడుతూ వెళ్లిపోయేవాడు అక్కణ్ణుంచి వెంకటరాజు. భార్యతో యెక్కువగా మాట్లాడితే యెక్కడ డబ్బు అడుగుతుందోననీ అతనికి అమితభయం. అతని ప్రాణానికొక దెయ్యంలాగుండేదామె.

సుబ్బులైనా పాపం దుబారా ఖర్చులేమీ చేసేది గాదు. ఎప్పుడూ సినీమాకేనా వెళ్లేదిగాదు. తన రవికెలు, పిల్లలపావడాలు, జాకెట్లు అన్నీ తనే స్వయంగా కుట్టేది. భర్తదగ్గిరకిచ్చిన కూలి మిగల్చుకునేది. ఆ డబ్బుతోను, దొంగతనంగా బియ్యమమ్మి పిల్లలను బడికి పంపించి సంగీతం నేర్పించేది. పట్టుదారాలన్నీ కొని, గుమ్మాలకు, దుప్పట్లకు. బల్లలమీద గుడ్డలకు, పిల్లలచొక్కాలు పరికిణీలకు చక్కగా ఎమ్బ్రాయిడర్లను కుట్టేది. ఇవన్నీ చూస్తే వెంకటరాజుకి తలనొప్పివచ్చేది. ఈ కుట్లన్నీ కూడుపెడతాయా గుడ్డలిస్తాయా? ఆడబ్బంతా పోగుచేస్తే ఒక పెళ్లి చేయించవచ్చుననేవాడు. తన పక్కమీద పువ్వులు కుట్టిన దుప్పటివేస్తే తీసి పారేసేవాడు. భార్యచాటుగా యెన్ని బియ్యమమ్మినా, తన జేబులో డబ్బు లెన్ని మాయమైనా తెలిసేది గాదు. కానీ తనచేత్తోమాత్రం భార్యకి యెఱ్ఱని యేగాని యిచ్చిన పాపాన్ని పోలేదా బ్రాహ్మణుడు.

అత్తగారు రావమ్మ అందరికి సలహాలిస్తూ బయట వాళ్లందర్ని ఆదరించేది. చాలామంచి మనిషని ప్రసిద్ధికెక్కింది. కొడుకుగూడా చాలా మంచివాడు. యెక్కడా నోరులేదు. ఒకరిజోలి శొంఠి అక్కరలేదు. ధర్మరాజులాంటివాడు. సరియింక కోడలు చెప్పనే అక్కరలేదు. అందరికి తలలోనాలిక. సుబ్బులమ్మకి చెప్పనిదే యిరుగుపొరుగువారేపనిని చేసేవారుగారు. మంచిస్నేహపాత్రురాలు అనేవారు. గానీ యింట్లో మాత్రం పిల్లుల కొట్లాటే. ఒక్కొక్కపూట రాత్రిళ్లు భోజనాలేవుండేవిగావు. భిన్నాభిప్రాయాలు గల ఆ యింట్లో ఐక్యమత్యం యెలాగుదురుతుంది. సుబ్బులెంత అరిచినా యెవరికి లెక్క ఆయింట్లో. నోరుంటే తలగాస్తుందంటారు. గానీ, డబ్బున్న వాళ్లదేరాజ్యం యీ కాలంలో. పిల్లకి పెళ్లిచెయ్యాలన్నా, పిల్లాడికి ఒడుగు చెయ్యాలన్నా, ఇల్లుకట్టాలన్నా యేస్వల్ప విషయమైనాసరే తల్లీ కొడుకులది యేకాభిప్రాయం. యేవిషయంలోనూ యేవిధమైన హక్కు లేదు సుబ్బులమ్మకు. వేరే ఒకచోట కూర్చుని రహస్యాలాడేవారు తల్లీ కొడుకు. తల్లియెంత చెబితే అంతే కొడుకుకి. గనక అత్తగారు భర్తతో చెప్పలేదని మండిపడేది అత్తగారి మీద కోడలు. ప్రపంచంలో స్త్రీ కేవలం బానిస క్రిందే వుపయోగపడుతుందన్నమాట. ఆ యింట్లో సుబ్బులమ్మ కేవలం పిల్లలను కనే ఒక యంత్రం. ఇన్నాళ్లబట్టి సంసారం చేస్తూన్నా, యింతమంది బిడ్డలను కన్నా, యింట్లో పనిమనిషి కన్నా అధ్వాన్నంగా వుంటే సంసారంలో సుఖమనేది యెవరికి? ఆమె ప్రేమకు, స్వతంత్రానికి, అర్థానికి గూడా నోచుకోలేదు. ఆర్థిక స్వాతంత్ర్యం లేని స్త్రీకి, సంసార స్వతంత్రంలేని స్త్రీకి ఆసంసారం ఒక నరకకూపమే. వెంకట్రాజుగారు స్వగ్రామంలోనే యిల్లుగట్టి పిల్లవాడికి ఒడుగు, పిల్లకి పెండ్లిగూడా చేసేశాడు. ఇంట్లో సంసారాన్ని కష్టపెట్టి, చెమటూడ్చి రక్తంబొట్లలా లెక్క

# క న్న క డు పు



(శైశవంలోనే తండ్రిని కోల్పోయిన తన పసిపాప పాలబుగ్గల చిఱుపెదవుల తాకున మురిసిపోతూ "మీనాన్నే ఉంటే ... అయ్యో!" అని వెచ్చనూర్పుచు కుప్పకూలిన ఒకతల్లి హృదయనిర్వేదమే ఈక్రింది పద్యాలలోని ఇతివృత్తం.)

పుండ్రము వెట్టి, యిన్ని చిఱుబొజ్జకు పాలనుబోసి చిట్టినా
తండ్రి నుయేలనూప, మెలతల్ మురిపెమ్మున ముద్దుగొంచు, తా
మంద్రము "భవత్కుమారుఁడు మహాప్రభువౌ" నని; అయ్యో! ముక్కులో
వెండ్రుక కొప్పులోన కనుపించిన అప్పటిమాట; నాయనా!

అచ్చట ముచ్చటల్ జరిపి అందఱకున్ పరితృప్తిఁగూర్చు నీ
పొచ్చెము లేనియట్టి వలపుం బువుదేనియ వాకలన్ మనం
బిచ్చగనాడుకోన్ సుకృతి యెంతయొగావలె; కట్ట' దైవమున్
వెచ్చని చూపుఁజూచె; కలవే గతు లిట్లు విధాతృఁడెంచినన్?

ఈ నునుబుగ్గలందు ప్రవహించెడి కమ్మని జంటితేనె మీ
నాన ఒకప్పుడైన తననాలుకతో చవిచూచు భాగ్యమున్
గానకపోయెఁగా! ఇపుడొకత్తెను నాహృదినిన్ను హత్తికో
బూనెద; కాని మీజనకు ముచ్చట వచ్చిన గుండెవ్రయ్యలౌ!

ఆనాయౌవనమెల్ల కొల్లగొని నిన్నర్పించె మీనాన్న; కు
ఱ్ఱా! నీమూర్తియె గుర్తు మాత్రమణయ సామ్రాజ్యోజ్వలశ్రీకి; ప్రే
మానందైక నిధానమైన నిను నాప్రాయంబునన్ పెంచెదన్
నానోముల్ ఫలియింపగా నలరుమన్నా! జన్మధన్యంబగున్.

కలుముల్ లేములు కాలగర్భమున నైక్యంబౌను; నిర్వ్యాజప్రే
మలలీలల్ స్థిరకీర్తిచంద్రికల రమ్యంబౌను; చంద్రోదయ
మ్ముల నుప్పొంగెడి వాహినీధవుఁడు; బాబూ! మాతృగర్భంబు పు
త్రులపెంపుంగని యూరటంగనును, లేదో, ఆరడింబొందురా!

ఆరడిపెట్టబోకు, మదుపాజ్ఞలలో చరియింపకున్న చో
ఏరికిఁగాకపోదు, వదరెరే! 'ఒకబిడ్డగాడు బిడ్డడు;' నీ
దారిని నీవు క్రమమ్మరిన, తప్పక పీడాకరాలుగాయ యం
చూరక ఆడిపోసుకొనునోయి, కుమారక! లోకమంతయున్.

అప్పులపాలు జేసి చనె నాయన; అర్థులు బాగ ధప్ప శాల్
పప్పును మెక్కి; రేవు తినవచ్చిన ఇప్పుడు చిల్లిగవ్వయున్
చొప్పడ దీకుటుంబమున; శూన్యతలన్ దలపించుచున్న నన్
తిప్పలు పెట్టబోకు; మొకతీరున సాగవు రోజులన్నియున్.

పరిణామమ్మనునట్టిదీ ప్రకృతికిన్ భావ్యంబు; నీస్నిగ్ధసుం
దరబింబోష్ఠము సోకి మేనఁబులకింతల్ గాంచె నీతల్లి; బం
ధురమానీయనుభూతితో ప్రకృతిలోతుల్ తాకునో! లేక అం
బరవీధిన్ పయనించునో అమరసంబంధంబు నాశించుచున్!

నాకీలోకముతో పనేమి? భవదానందాశ్రువుల్ వెల్లువై
లోకంబుల్ కనుమాపు జేయు, చిఱువెల్గుల్ చిమ్ము నీనవ్వ నే
నౌకారాజము జేసి జీవననదిన్ దాటంగలేనో! ఇకన్
నాకంబే నిగమించి "సౌఖ్యమెట? ఇంద్రా!" యంచుపృచ్ఛింపనో!

వా. వెం. ల. నరసింహారావు.

# గృహిణులు, విద్యాగోష్ఠి





శ్రీమతి వెంకాయమ్మగారు

సామాన్యంగా పురుషులకూ స్త్రీలకూ ఉన్న ప్రభేదాల్లో విద్యాసంబంధం అయిన ప్రభేదం ఒకటి. అదేమిటంటే-పురుషుల్లో చిన్నతనంలో ఏకొద్దో చదువుకొన్నప్పటికీ పెద్దయిన తరువాత ఆచదువు వారిలో బాగా వికసించి ఎక్కువ దశలో ఉంటుంది. ఇక స్త్రీలలోనో (అంటే అధిక సంఖ్యాకంగాఉన్న మధ్య శ్రేణి కుటుంబాల్లో) చిన్నతనంలో ఎంతబాగా చదువుకున్నా పెద్దయిన తరువాత వారిచదువు హీనదశలో ఉంటుంది. పురుషులు తాము చదువుకొన్నప్పటికంటే తరువాత నేర్చుకొనేది జాస్తి. స్త్రీలు తాము చదువుకొన్న నాటికంటే తరువాత మరిచిపోయేది జాస్తి. ఒక్కొక్కమ్మాయికి తల్లిగారింటివద్ద ఉన్నప్పుడు ఎంతోచదువు-సంగీతం, సాహిత్యం, హిందీ, ఇంగ్లీషు, ఇంకిట్లాంటివెన్నో నేర్పిస్తారు. ఏంలాభం! అత్తవారింటికొచ్చిన ఆ తరువాత ఆయావిషయాలతో సంపర్కమే ఉండదు. పై విరుద్ధానికొకటే కారణంతోస్తుంది. పురుషులు విద్యాలయం వదలిపెట్టినా విద్యాగోష్ఠిమాత్రం వదలిపెట్టరు, అంటే వారి వ్యవహారజీవితంలో వారివిద్యకు రాపిడిజాస్తి. వారివిద్యకు తుప్పుపట్టేందుకెక్కువవకాశం ఉండదు. స్త్రీలకో ఆవిధంగా కాదు; వారు విద్యాలయం వదలింది మొదలు ఒకరింటికొచ్చి చాకిరీచేయటం, సంతానం గనటం, ఆసంతానాన్ని పోషించటంలోనే సరిపోతుంది వారికాలమంతాను. ఇకఇంతె బయటి ప్రపంచంతోపనిలేదు. ఇంట్లోపుస్తకం పట్టుకొనే అవకాశాన్ని కూడ కల్పించుకోరు. నవ్యసంస్కర్తల్లోనే ఒక తెగవారున్నారు; వీరు స్త్రీల విషయాల్లో అదోరకం అయిన ధోరణిలో ఉంటారు. స్త్రీల స్వాతంత్ర్యం అంటే ఇల్లూవాకిలీ లేకుండా, పిల్లాజెల్లాలేకుండా, పుస్తకం బట్టుకొని కుర్చీ ఎక్కి కూర్చోటం, లేక మొగవాళ్లవలె ఆఫీసుల్లో ఉద్యోగాలు జేయటం అనే రకాలవారు పైవారు జెప్పినమాట కాదనేందుకు వీలులేదు. అంతమాత్రాన స్త్రీలు అచ్చంగా కుటుంబవ్యవహారాల్లోనే మునిగుండి బాహ్యజగత్తుతో బొత్తిగా సంబంధంలేకుండా ఉండటం అనేదిగూడ ఆదర్శగృహిణి ధర్మం కాదు. కుటుంబాన్నీ జూచుకోవాలి, బయటి ప్రపంచంలో ఏంజరుగుతుందో గూడ తెలుసుకోవాలి. సాధారణంగా వాడుకేమిటంటే-పురుషునికి ఇంటి బయటి విషయాలూ, స్త్రీకి ఇంటిలోపలి విషయాలూ కావాలని, కాని న్యాయంగా ఆలోచిస్తే పురుషుడు కేవలంబయటి విషయాలతోనే ఉండలేడు, ఇంటిలోపలి విషయాలు గూడ పట్టించుకోంది ఘడియజరగదు. అదేవిధంగా స్త్రీకి గూడ అచ్చంగా ఇంటిలోపలి విషయాలతోనే సాగదు, బయటి విషయాలు గూడ అవసరమే. పురుషుడికి బయటి వ్యవహారాలు మొదటివిషయం, ఇంటిలోపలి వ్యవహారాలు రెండో విషయం. అదేమాదిరి, స్త్రీకి ఇంటిలోపలి వ్యవహారాలు మొదటి విషయం బయటి వ్యవహారాలు రెండోవిషయంగా ఉండాలి. కుటుంబ విషయాలు చూచుకుంటూ గృహిణులు విద్యాగోష్ఠి చేసుకొనేందుకు చాలా అవకాశం ఉంటుంది. వారికి కావాలసిందేమిటంటే విద్యమీద అభిలాష, ఉత్సాహం. ఈరెండూ ఉంటే ఎన్నిచిక్కుల్లో ఉన్నా, ఎంతమంది పిల్లల్ని పోషిస్తున్నా విద్యా ప్రపంచంతో సంబంధం ఉంచుకోవచ్చు. ఇంటిపనుల్లో మునిగుండి విశ్వవిద్యాలయ పరీక్షలకు చదివి ప్యాసయిన స్త్రీలుగూడ కొందరున్నారు.

స్త్రీలు గృహిణులుగా ఉండి విద్యావ్యాసంగం సల్పాలంటే ఒకవిషయంమాత్రం చాలా అనుకూలంగా ఉండాలి; అది వారిభర్తల సహాయం. ఈసహాయం ఎంత అనుకూలంగా ఉంటే అంత ఉచ్చదశలో కొచ్చేందు కవకాశాలుంటవి గృహిణులకు.

సాధారణంగా ప్రతిస్త్రీకి ఇరవయినాలుగు గంటల్లో నాలుగుగంటలయినా తీరికలేకుండా ఉండదు. ఆసమయంలో వార్తాపత్రికలు చదువుకోవచ్చు; ఇంకేవైనా పుస్తకాలు చదువుకోవచ్చు; 'గృహలక్ష్మి' కి వ్యాసాలు వ్రాయటం నేర్చుకోవచ్చు. భర్తలతో కబుర్లతో కాలంబుచ్చేటప్పుడు దేశవిదేశాలను గురించి తమకు తెలియని విషయాలను అనేకం అడిగి తెలుసుకోవచ్చు. ఇంకా చిత్రకళ, సంగీతంమొదలైన లలితకళలపైన అభిలాష, అభిరుచీ ఉన్నవాళ్లు వాటినిగూడ అభ్యసించుకోవచ్చు.

అదేంచిత్రమోగాని ఎన్ని అవకాశాలున్నా ఆడపిల్లలు అత్తవారిళ్లకొచ్చి చదువు సంగతే మరచిపోతారు. అంతటితో తమమీద ఏదో పెద్దబండ పడ్డట్టు భావించి, తమ ఇదివరకు జీవితాన్నే మరచిపోయి అదొకరకం మనుష్యుల్లాగా తయారవుతారు.

చిన్నప్పుడు ఎంతచదువుకున్నా ఏంలాభం? దాన్ని తరువాతి జీవితంలో రాణింపుకు తెచ్చుకోనప్పుడు! ఇప్పుడిప్పుడు చాలామంది అత్తవారిళ్లకొచ్చిగూడ విద్యాగోష్ఠిని వదలకుండా పట్టుకొస్తూన్న గృహిణులు కన్పిస్తున్నారు; చాల ఆనందప్రదం.

గృహిణులకు విద్యాగోష్ఠి అనేది నిత్యజీవిత కార్యక్రమంలో ఒకటిగా ఉండిపోవాలి. వంట చేసుకోటం, పిల్లలను పోషించటం, భర్తగారి సేవజేయటం ఎంతఅవసరమో విద్యాగోష్ఠికూడ అంతే అవసరం. తాను నేర్చుకొన్నదేదో దాన్ని నిత్యజీవితంలో ఉపయోగించుకోవాలి. కొందరంటారు- బాగాచదువుకొని అన్ని విషయాలూ తెలుసుకొని సమయంవచ్చినప్పుడు వచ్చేవరకు చదువుదారి చదువుదే తమదారి తమదే, మనం నేర్చుకొన్న ప్రతి క్రొత్తవిషయాన్నీ మనజీవితకాలంలోని ప్రతిచిన్న అవసరాల్లోగూడ ఉపయోగ పెట్టగలిగితేనే మన విద్య ధన్యం. లేకపోతే 'చదువుకున్నవాళ్లకంటె చాకలివాళ్లు మేలు.'

ఇంతకూ గృహిణులు గుర్తుంచుకోవాలసిందేమంటే, తాము అత్తవారిళ్లకు కాపురానికి రాగానే జీవితాన్ని గురించిన ఇతర విషయాల్లో తమకర్తవ్యం పూర్తయిందనుకోరాదు. తమకు అభిలాషఉన్న విద్యావ్యాసంగాన్ని ఉన్నతిలోనికి తెచ్చుకోటం తమకర్తవ్యం అనేమాట మరచిపోగూడదు. కాని ఇందుకు కొన్నికుటుంబాలలో పెద్దలు గృహిణుల విద్యావికాసానికి అవకాశం ఇవ్వకపోగా పైగా అనేక అడ్డంకులు గల్పించి తమ అయిష్టాన్ని పూర్తిగా అమలుపరుస్తారు. ఇట్టి విషమపరిస్థితుల్లో గృహిణులు తమ మృదుమధుర స్వభావంవల్ల వారిని ఒప్పించి తమకనుకూలంగా చేసుకోవాలి.

గృహిణులైన తరువాతగూడ స్త్రీలు ఈవిధంగా విద్యాగోష్ఠి వదలుకోకుండా తాము ఇదివరలో తల్లిగారిళ్లవద్ద నేర్చుకున్న చదువును వృద్ధిలోకి తెచ్చుకుంటూ, ఇంటి, బయటి విషయాల్లో గూడా అవసరం అయినంత కల్పించుకొంటూ ఉంటే వారిగృహాలు సరస్వతికి లీలానికేతనాలుగా మారుతాయి.

---




# జండుబాలామృతము

క్షీణించి అనారోగ్యవంతులుగా నుండు బిడ్డలకిది యమృతమువంటిది. వారికి ఆకలిని వృద్ధిపరచి ఆరోగ్యము నిచ్చును.

పిల్లలకు దంతములు మొలుచునప్పుడు కలుగు నొప్పులను పోగొట్టును. కాళ్లు చేతులు శుష్కించి కడుపు పెద్దదిగా నున్న బిడ్డలకిది దివ్యౌషధము. జీర్ణించిన జలుబు, దగ్గు మొదలగు వాటినికూడ నివారించును.

**బుడ్డి ఒకటికి రూ. 1-2-0.**

రాజా అండుకో., నంద్యాల.
దుర్గా మెడికల్ స్టోర్సు, కావలి
రావ్సు మెడికల్ స్టోర్సు, పాలకొల్లు
రాధాకృష్ణా మెడికల్ స్టోరు, నరసపూరు

పి. సీతారామయ్యా, ఎలమంచిలి
కుసుమంచి అప్పలరాజు, అనకాపల్లి
సీలం & కో., విశాఖపట్టణం.
దుర్గ & సన్సు, కర్నూలు.








(డిసంబరు సంచిక తరువాయి)

## 2-వ అంకము

### 2-వ రంగము.

ఆనెగొందెలో ముక్తాంబ గృహము.

(ముక్తాంబ శయ్యపై బరుండి తనలో)

నేడేమియో నాకు దుశ్శకునములు దోచుచున్నవి. ఏమైన కీడు మూడ నున్నదా? లేక నావల్లభుండగు విజయుని కేమైన యాపద రానున్నదా? కడుపులో చెయ్యిబెట్టి కలచినట్లున్నది. కానున్నది కాకమానదు. ఎవ్వరో వచ్చుచున్నట్లున్నదే. (లేచును) (ప్రవేశము రుద్రదేవుడు.)

ము:- వీరవర్యా! స్వాగతము. మనరాజకీయ వ్యవహారము లెట్లున్నవి? రామయామాత్యుని ప్రతిభా విశేషంబుచలన మన కార్యంబులు నిర్విఘ్నముగా కొనసాగుచున్నవా? మీ దర్శనము లేకపోవుటచేత నాకేమియు దెలియుటలేదు.

రు:- కాంతామణి! అన్నియు మనకనుకూలంబులుగనే యున్నవి. స్వజనులు రహస్యంబుల వెల్లడించి విఘ్నంబు గావింపనిచో తలంచినవెల్ల నెరవేరి మన కార్యమెప్పుడో సానుకూల మయ్యెడిది.

ము:- రుద్రదేవా! నీ యభిప్రాయము నా కవగతమైనది. విజయుని నేను రక్షించితినని మీరందరు భావించుచున్నారు. నా రాజ్యము సంపాదింప నేనే రామయామాత్యుని సాయ మపేక్షించితి. నా కొఱకే యిన్ని యిక్కట్టుల బడుచున్న రామయామాత్యుని యెడ నేనంత యవిశ్వాసంబుగా వర్తింతునా? నాస్వకార్యము నేనే చేతులార చెడగొట్టుకొందునా? నేనంత వివేకహీనురాలనా?

రు:- తరుణీ! కోపగింపకుము. రామయ మంత్రివాక్యములు నిజమని దలంచితిని.

ము:- విజయుని రక్షించుటకై తిమ్మనను రామరాజు నిటకుబంపెనట. వాడే మన కార్యమును చెడగొట్టె; మీరు నింద నాపై వేసితిరి.

రు:- లేదు లేదు. నాపొరపాటు క్షమింపుము; నీవు విజయుని ప్రతి శత్రునిగా దలంతు. వేని నాచెప్పువార్త నీ కత్యంత ప్రియకరము సుమా?

ము:- ఏమీ? వాడు మరణించెనా; యెట్లు?

రు:- సుందరీ! వాడు నేడో రేపో వధింప బడ నున్నాడు. రామయ మంత్రి కార్యము చక్కగా నిర్వహించినాడు. ఇంతటి వానితో విరోధించినవాడు మన గలడా? రాయల కాతనిపై నాగ్రహము గల్పించి మృత్యుదండన విధింప జేసె.

ము:- ఏమి: విజయసింహునిపై రాయల కాగ్రహము గల్పించి వధించుటకై తగిన యత్నము జేసినాడా? ఔరా యేమి రామయామాత్యుని నిరుపమానబుద్ధి వైశద్యము? అదెట్లు గావించె సవిస్తరముగ దెల్పి నన్ను సంతసింప జేయుము.

రు:- ప్రియా! వినుము; రాయలు విదేశవర్తకులయొద్ద రెండుంగరంబుల గొని తన వ్రేలనొకటుంచుకొని, యొకటి యనంగసేనకిడియె; తిమ్మరుసును రక్షించిన సందర్భమున తన చేతనున్న యుంగరము విజయసింహునకు బహుమానమిచ్చె. యాతడిచ్చటకొచ్చినపుడు వాని యుంగరమును మేమపహరించితిమి. మరి నాడు రామయమంత్రి పిచ్చివాని వేషంబున కోతి నాడించుచు అనంగసేనవద్దకుబోయె. ఆమె కోతికి ఫలంబు లీయవచ్చినపుడు కోతి యామెపైకిదూకె. అపుడామె భయంబున చేయి విదల్చుకొనగా నుంగరము క్రిందబడెను. క్రిందనున్న యుంగరమును సంగ్రహించి, తన యొద్దనున్న యుంగరమట బడవైచె. ఆమె తనదే యని భావించి దానిం గొనిపోయె.

ము:- ఆమె యుంగర మెట్లు విజయుని కందజేసె?

రు: దారిలో నాబోతు 'పిచ్చి' రామయమంత్రిం బొడువవచ్చె. విజయసింహుం డద్దారిని బోవుచు నా బోతునుద్రోలి రక్షించె. అందులకు కృతజ్ఞతా చిహ్నముగా నీ యుంగరమును గైకొనుమని చెప్పి యొసంగె.

ము:- ఆహా యేమి యుపాయము; రాయలకీ సంగతినెట్లు తెలియజేసితిరి?

రు:- అనంగసేన చెలికత్తెయగు మాలతి నిత్యంబు నొక పుష్పహార మొకవర్తకునియొద్ద గొనుచుండును. ఆ సంగతి కనుగొని యావర్తకునితో మైత్రినెఱపి యొకనా డనంగసేన కొకకమ్మను విజయసింహుడు వ్రాసినటుల లిఖించి పూలమాలలో గ్రుచ్చి యిచ్చితిని; రాయలా లేఖనుగాంచె.

ము:- రుద్రదేవా మీ బుద్ధిబలంబత్యంత ప్రశంసాపాత్రము మీ తోడ్పాటున నా కార్యము సానుకూలం బగునని నమ్మకము గల్గుచున్నది.

రు:- తరుణీ! నే నేతెంచి చాలసేపాయె బోయివత్తును.

ము:- మంచిది. నేడు సంతోషకరవార్త దెల్పితివి బొమ్ము. (రుద్రదేవుడు వెళ్లును.)

ము:- (తనలో) ఆహా యెంత విపరీతము. రామయమంత్రి దుష్ట చెయిదంబుల కంతంబు లేకున్నదే. నిష్కారణముగా నా యిల్లాలికెట్టి యిక్కట్టును గల్గజేసె? నిరపరాధియగు నావిజయుని కెంత ముప్పువాటిల్లజేసె! విజయుడు మరణించిన తర్వాత నాకు రాజ్యమేల? జీవమేల? నాకుదెలిసిన విజయుని ప్రాణరక్షణోపాయంబు దెలుపక నేనెట్లుండగలను? మంత్రివరున కీసంగతులన్నియు తేట తెల్లమగునట్లొక లేఖను వ్రాసి బంపెదను. ఓసీ, కలమును కాగితమును గొనిరమ్ము. (దాసి తెచ్చియిచ్చి వెళ్లును)

ము:- (జాబును వ్రాసి మడచియుంచి) దీనిం గొనిపోవు వారెవ్వరు? నే నేగుదునా? వలదు వీరనుమానింతురు. నా కాప్తులెవ్వరుగలరు? యేమి చేయుదును? కానిమ్ము రెండుదినములు గడవున్నది గదా? యీలోగా నేరినైన విచారింతును.

[తెర]

3-వరంగము.

పూజామందిరమున ముక్తాంబ హారతియొసంగి, దేవీ ప్రార్థనజేయుచు

ము:- దేవీ కరుణింపుము దాసురాలి నను గ్రహింపు. తల్లీ యాశ్రిత కల్పవల్లీ! నాయందింత కాఠిన్యము వహింతువేల? సావిత్రి నిన్నారాధించి భర్తప్రాణంబుల బడసె. అట్లే నేనును నిన్నారాధించుచున్నాను; నా విజయుని బ్రతికింపుము. ఇంకొక్కరాత్రియే గడవు; తెల్లవారుట తడవుగా విజయుని వధ్యస్థానంబునకు గొనిపోవుదురు. నాహితులెవ్వరు నిందు లేరు; యేమిసేతు? నెందుజొత్తు? నెవ్వరి నాశ్రయింతు? తల్లీ నీపాదాబ్జము లాశ్రయించిన వారి కాపద దానేరదందురే.

సావిత్రీ ముఖపూతపుణ్య సతుల
    శ్రాంతంబు సద్భక్తి సం
భావింపన్ దదభీష్ట సిద్ధిసలుపన్
    భావింతుగాదే మహా
భావాతీతవిశుద్ధ తత్త్వమహిమా
    స్పంద స్వభావా సతీ!
నేవేరీతుల గొల్తు నీపదము దే
    వీ! శాంకరీ! శాంభవీ!

(దేవి పాదములచెంత మోకరిల్లును.)
(దాసిత్వరగావచ్చి) అమ్మా! నీ దర్శనమునకై యెవ్వరో వచ్చియున్నారు; విజయనగరమట.

ము:- ఏమీ! విజయనగరమా! త్వరగా ప్రవేశపెట్టుము. (దాసిపోవును) (ప్రవేశము రామరాజు)

ము:- అన్నా వచ్చితివా? ఆపద్బాంధవుండగు శ్రీకృష్ణుండు ద్రౌపదియెడ దయజూపినట్లు నాయెడ దయజూపుచున్నావు. నీ ఋణమెట్లు దీర్చుకొందును? పొమ్ము రాజేంద్రున కీకమ్మనిమ్ము, విజయునికి ప్రాణదానం బిడి నాకు బతిభిక్షబెట్టుము.

రా:- చెల్లెలా! వెదుకబోయిన తీగె కాలికి జుట్టుకొన్నట్లున్నది. విజయుని రక్షణోపాయంబేమైన నీకు దెలియునేమో యని మంత్రివరుండు నన్నిటకంపె. నీదర్శనమే దుర్లభమగునని చింతించుచు వచ్చితిని. నీవే నాకు సాయమొనర్చితివి.

ము:- ఇది నా స్వవిషయముగదా? నీవు నన్ను కొనియాడవలసిన బనిలేదు. సమయాన కేతెంచి సాయబడినందుకు నేనే నీకు కృతజ్ఞురాలనై యుండవలె.

రా:- ఈజాబువలన విజయుడు జీవించును గదా?

ము:- తప్పక జీవించును బొమ్ము, శత్రువుల నేమరకుము.

[తెర]

(సశేషము)



# సాధ్వి

రచన: శ్రీమతి వంగల వాణీబాయి

(డిసెంబరు సంచిక తరువాయి)



సుమతి హాస్పిటల్‌నించి వచ్చేటప్పుడు తెచ్చుకొన్న ఆస్తి ఒక చిన్నఅద్దం, ఒక నల్లఅద్దాల కళ్ళజోడు మాత్రమే! సుమతి ముక్కు బాగా చితకడంచేత, సొట్టముక్కు, ఒకకన్ను వంకర, కనుబొమ్మమీద ఒక పెద్దమచ్చ, కాలు కొంచెం కుంటి సంభవించాయి. తనతో తెచ్చుకొన్న కళ్ళజోడు (Gogles) ధరించి రైల్లోకూర్చునికూడా పదే పదే అద్దాన్ని చూచుకుంటూ, తన్ని ఇదివరకు ఎరుగున్నవాళ్లు కూడా గుర్తుపట్టడం అసంభవమనీ తన భర్త, పిల్లలూ అయినా తన్ను స్వీకారిస్తారో లేదో అని భయపడ్తూనే ఆ ఊరుచేరింది. ఊరు తెలిసిందే కాబట్టి తిన్నగా తనభర్త, పిల్లలూ ఉంటారనుకొన్న తనయింటికే వెళ్లింది. ఆఇంట్లో మరి ఎవరో ఉంటున్నారు. నరేంద్ర ఎవరో కూడా మాకుతెలియదన్నారు. ఆ ఇంటిప్రక్క చాల ఏండ్లనించీ ఉంటున్న వార్ని అడిగితే, వారు సుమతిని గుర్తించలేక ఎవరో అనుకొని నరేంద్ర షుమారు రెండు నెల్లక్రిందట ఇల్లు ఖాళీచేసి పిల్లల్ని తీసుకు వెళ్లిపోయాడనీ అతని భార్య రైలుప్రమాదంలో చనిపోయిందనీ చెప్పారు.

సుమతి అంతా గ్రహించుకొని తనను ఇంకెవ్వరూ పోల్చుకోలేరని నిశ్చయం చేసుకొని, ఎక్కడైనా పనియైనా చేసుకు జీవనంచేసుకోవాలని నిశ్చయించి, వెతకి వేసారి చివరికి తనభర్త ఇదివరకు ప్రైవేట్లు చెప్పే జాగాలు జ్ఞాపకం ఒచ్చి అక్కడికే వెళ్లి అడిగితే ఏదైనాపని దొరకవచ్చు, తన భర్త, పిల్లల విషయం కూడా ఏమైనా తెలియవచ్చు ననుకొని ఇల్లు వెతుకుతూ వచ్చి ఆ ఇంటి ఆవిడ్ని కలుసుకొని "నేను అన్నిపనులూ చెయ్యగలను, దయ యుంచి ఏపనియైనా ఇచ్చి ఈదీనురాలినైన నన్ను రక్షించండి" అని ఏడ్చెను. ఈసొట్టముక్కు కుంటి కాలు గల ఈమనిషి ఏంపనిచెయ్యగలదని సుందరమ్మగారు మొదట "మాకు అవసరం లేదమ్మా" అన్నప్పటికీ దుఃఖించి అట్లా వేడుకుంటూంటే జాలిపడి "సరేలే పదిరోజులు; మాత్రం నా ఇంట్లో నిన్ను ఉంచుకొని ప్రయత్నించి చూస్తాను!" అని చెప్పి ఆ జాలిగుండెగల యిల్లాలు సుమతికి పని ఇచ్చింది.

సుమతి ఆ ఇంట్లో చేరినప్పటినుంచీ ఇంటిపనులన్నీ చక్కపెట్టుట, మిగతా నౌకర్లచేత దగ్గర ఉండి పనులన్నియు చక్కగా చేయించుటా, పిల్లలకు ఎంతో ఆదరంతోనూ ప్రేమతోనూ, తలలంటువ్వి స్నానాలు చేయించి దుస్తులు తొడిగించి వాళ్లను స్కూళ్లకు పంపడం మొదలైన పనులూ, ఇంకా సుందరమ్మగార్కి గృహకృత్యాల్లోనున్నూ, కుట్టు పనులలోనూ, ఒకటేమిటి అన్నింటిలోనూ ఎంతో సహాయపడుతూ, ఇదినాపని, అదినాపని కాదు అనకుండా యజమానురాలి అనుగ్రహం కొంచెం రోజుల్లోనే సంపాదించగల్గింది. పిల్లలు ఇంటికి రావడంతోనే ముందు సుమతిదగ్గరకే వెళ్లేవారు. పిల్లలకు చిన్నిచిన్ని కథలు చెప్పి వారిని ఆడించేది.

ఇటువంటి మంచి పనిమనిషి దొరకడం ఎంతో మంచి అదృష్టంగానే భావిస్తోంది సుందరమ్మగారు.

ఒకటి రెండు సార్లు సుమతినిగురించిన వివరాలు అడిగి తెల్సుకోవాలనుకొంది గాని, ఆమె తెలుసుకోవలెనని ప్రయత్నించినప్పుడల్లా సుమతి "తనొక నిర్భాగ్యురాలననీ, తనకూ ఇద్దరు పిల్లలుండేవాళ్లనీ, వాళ్లు చనిపోయారనీ మాత్రం" చెప్పి వెక్కి వెక్కి యేడ్చేది. నొక్కి నొక్కి అడిగి ఆమెను దుఃఖపర్చడ మెందుకని సుందరమ్మగారు కూడా మళ్లీ అడుగలేదు. ఈ విధంగానే మూడు, నాలుగు మాసాలు గడిచాయి.

ఈలోగా అనాధ ఆశ్రమంలో ఉన్న ఇద్దరు అనాధ బిడ్డల్ని చూడడానికి సుందరమ్మగారు 1, 2 సార్లు వెళ్లివచ్చింది గాని ఎప్పుడూ ఆవిషయమై సుమతితో చర్చించలేదు. సుమతి కేంసంబంధముంటుంది అనుకుంది. ఇట్లామరి కొన్నాళ్లు గడిచాక ఒకనాడు వీళ్లుకూర్చుని ఉండగా ఆకస్మాత్తుగా అనాధాశ్రమం నించి, ఆపిల్లవాడికి షుమారు వారం రోజుల్నించీ జ్వరం వస్తోందనీ ఆరోజే డాక్టరు చూచి ఇది న్యుమోనియా జ్వరం అని చెప్పాడనీ కబురువచ్చింది. వెంటనే ఆదయాళువు అయిన సుందరమ్మగారు ఆశ్రమానికివెళ్లి అవసరమయిన ఔషధాలు కొని ఇచ్చి అబ్బాయిని చూచి "మళ్లీ రేపువస్తానని చెప్పివచ్చింది. ఇంటికివచ్చిభోజనంచేస్తూ తనకుసుమతి వడ్డిస్తున్న సమయంలో "పాపం ఇద్దరు అనాధబిడ్డలు షుమారు ఒకఏడాదిక్రింద మావీధివైపు వసారాలో దొరికారు. వాళ్లు అప్పటినుంచీ అనాధాశ్రమంలోనే పెరుగుతున్నారు. కాని అందులో ఆ అబ్బాయి షుమారు 5 సంవత్సరాల బాలుడు; న్యుమోనియా జ్వరం వచ్చింది. ఇప్పుడు నేను అక్కడికే పోయి వచ్చాను. పాపం ఎట్లా ఉంటుందో"? అంటూ సుందరమ్మగారు చెబుతూ ఉంటే, దొర చెవులు చేసుకొని ఇంకా దగ్గరకువచ్చి ఎంతో ఆతుర్దాతో వింటూ, సుమతి "అయ్యో, ఆబిడ్డలకు తలిదండ్రులు లేరా? బంధువులైనా లేరా? పాపము!" అంటూ పరాకుతో తాను వడ్డిస్తున్న పదార్థాన్ని కూడా ఆమె ఆకులో ఉంచుటకు మరచి నిలువునా నీరై, ముచ్చెమటలూపోసి అట్లే నిలువబడిపోయింది. సుమతి చాల కష్టాలనుభవించింది కాబట్టి కష్టపు వార్త వినలేక పోయిందనుకొంది ఆ ఇంటి ఆవిడ. "ఈసారి మీరు వెళ్లినప్పుడు నన్నుకూడా తీసుకు వెళ్ళండమ్మా, ఆ నిర్భాగ్యులైన బిడ్డల్ని నేనూ చూచి వస్తాను" అని వేడుకొంది సుమతి. "దానికేం అట్లాగేలే" అంది సుందరమ్మగారు.

మర్నాడు ఉదయం వాళ్ల నిత్యకృత్యాలన్నీ తీర్చుకొని, పిల్లల్ని బడికిపంపి సుందరమ్మగారు, సుమతి, అనాధాశ్రమానికి వెళ్లారు. సుమతికి దారి పొడుగుతా ఆపిల్ల లెవరై యుందురా, అన్న ఆలోచనలే. ఇరువురూ కారుదిగి తమతో తెచ్చిన హార్లిక్స్ సీసాలు, పండ్లు మొదలైనవి తీసుకు లోపల ప్రవేశించారు. సుమతి గుండెలు దడదడ కొట్టుకో సాగాయి. అక్కడి మేట్రన్ వీరిని, జబ్బుపిల్లల వార్డుకి (Ward) కి తీసుకెళ్లింది. పిల్లవాడు తీవ్రమైన జ్వరముతోనూ, బాధతోనూ గోడవైపుకి తిర్గి పండుకొన్నాడు. సుందరమ్మగారు ముందు దగ్గరకు వెళ్లి "ఎట్లా ఉందబ్బాయీ?" అనిపలుకరించింది. సుమతి కూడా దగ్గిరకు వచ్చి వంగిచూడడానికి ప్రయత్నించింది.

ఆదినం తెల్లవారి డాక్టరువచ్చి అబ్బాయిని చూచి ఇది చాల అపాయకరమైన జ్వరమనీ, ఆస్పత్రికి పంపితే మంచిదన్నాడనీ మేటన్ సుందరమ్మగారితో చెప్పింది. సుమతి అబ్బాయిముఖం చూచింది! నిశ్చేష్టురాలైపోయింది. ఈజబ్బుతోపడిఉన్నవాడు తన ముద్దుబిడ్డయే!! తనకు తెలియకయే అబ్బాయి మేను నిమిరింది. "నాయనా జబ్బుచేసిందా," అంది. కనులనుండి అశ్రువులు ధారగాకారుతున్నాయి. అంత వరకూ సుందరమ్మగారితో మాట్లాడుతూ నిల్చున్న

మేట్రన్ "మీతోవచ్చిన ఈ మనిషి అబ్బాయికి దగ్గరచుట్టమా?" అంది. "చుట్టం కాదు, పక్కం కాదు. కష్టాలనుభవించిన ఒక అనాధస్త్రీ. అందుచేత కష్టాలు విన్నా, చూచినా, ఏడుస్తుంది" అంది సుందరమ్మగారు. కాని సుమతి ఆపిల్లవాణ్ణి, నిమురుట, బుజ్జగించుట ముద్దుపెట్టుకొనుట మొదలైన ప్రవర్తనలు చూస్తే ఆమెకీ ఆశ్చర్యంగానేఉంది. "కష్టాలు పడ్డమనిషి కాబట్టి కష్టాలు చూడలేదు" అని తన యజమానురాలు మేట్రన్‌కి చెప్పడం సుమతి విన్నది. నిజము చెప్పకూడదని నిశ్చయం చేసుకుంది. పిల్లవాడ్ని వదలి వెళ్లడానికి మాత్రం మనసెంతమాత్రం ఒప్పుకోడం లేదు. సుందరమ్మగారు ఆ అబ్బాయికి జబ్బు ఎక్కువగాఉందని వినడంతోనే, అప్పుడే తన కారు మీదే హాస్పిటల్‌కి తీసుకువెళ్లి అక్కడ ప్రవేశపెట్టి పెద్దడాక్టరుకు చూపించి మాట్లాడిన వెనకే తాను ఇంటికిపోవలెనని నిశ్చయించుకుంది. ఆసంగతి మేట్రన్‌కి చెప్పింది, అబ్బాయిని చూచుటకు అతని అక్కను పిలిపించారు, సుమతి ఇంతసేపు అమ్మాయి ఎక్కడ ఉందని అడగవలెనని తలచియూ, అడగజాలక ఊరుకుంది. ఇప్పుడు ఆపిల్లరావడంతోనే చూచి ఎన్నో ఏండ్లనుంచి పరిచయమున్నదానివలె ఒక్కసారిగా ముందుకుపోయి గట్టిగాకౌగలించుకొని ముద్దుపెట్టుకుంది. ఇది అంతా చూస్తున్న సుందరమ్మగారు, మేట్రన్, (ఈ క్రొత్తమనిషి నన్నెవరు ముద్దుపెట్టుకుంటోందని) ఆవచ్చినపిల్ల, అంతాకూడా అత్యంతం ఆశ్చర్యంపొంది, సుమతిని పిచ్చిదానిగా భావించి ఊరుకొన్నారు. ఇక ఇక్కడ ప్రశ్నలతో జాగుచేసిన మంచిదికాదని ఆదయామయి సుందరమ్మగారు వెంటనే ఆజబ్బు పిల్లవాణ్ణి కారులో పరుండచేసి, ఆపిల్లకి ధైర్యం చెప్పి సుమతిని వెంట తీసుకొని ఆస్పత్రికి వెళ్లారు.

అక్కడ "అర్జెంటు కేసు"గా "ఎడ్‌మిట్" చేయించి పెద్దడాక్టరు వచ్చేవరకూ ఆగి అబ్బాయిని పరీక్షచేయించి, మళ్లీవస్తాను; బాగా చూచుకోండని నర్సులతో చెప్పి సుందరమ్మగారు వెళ్ళబోతూ సుమతిని పిలచింది, సుమతి, తాను జబ్బు పిల్లవాణ్ణి ఉపచారంచేస్తూ కనిపెట్టిఉంటాననీ దయచేసి ఉండనీయమని వేడుకొంది. సుందరమ్మగారికి ఆశ్చర్యం కలిగినప్పటికి, ఆ అబ్బాయికి జబ్బు ఎక్కువగాఉంది కాబట్టి కనిపెట్టి ఒకళ్లుండడం మంచిదేననీ తలచి "సరే నీకు నేభోజనంపంపుతాలే" అని సుమతిని వదలి వెళ్లింది.

అబ్బాయికి ఊపిరి త్రిప్పకోలేకుండా శ్వాస. జ్వరంతో వళ్లు కాలుతోంది. సుమతి వేడినీళ్ళ సంచితో కాస్తూ, భగవంతునికి ప్రార్ధనలు చేస్తూ ప్రక్కనే కూర్చుంది. ఆరోజు రాత్రంతా ఆఅబ్బాయికి నిద్రపట్టక బాధతో మూలుగుతూనే ఉన్నాడు. తెల్లవార్లూ రెప్పవాల్చకుండా సుమతి ప్రక్కని కూర్చునేఉంది. మర్నాడు షుమారు పదిగంటలకు మళ్లీ పెద్దడాక్టరు వచ్చాడు. రోగి స్పృహతప్పినవానివలె బాధతో పడి ఉన్నాడు, డాక్టరు పరీక్షచేసి అబ్బాయి చాలా ప్రమాద స్థితిలో నున్నాడనీ వెంటనే మరియొకరినెత్తురు అబ్బాయికి "ఇంజక్షన్" చేస్తేనేతప్ప బ్రతకడం దుర్లభమనీ అన్నాడు. ఇంతలోనే సుందరమ్మగారు కూడా ఆబ్బాయిని చూచేందుకు వచ్చింది. డాక్టరు ఆమెతో ఆవిషయమై చెప్పాడు. ఇదంతా వింటూ ఆదుర్దాతో నుంచున్న సుమతి "డాక్టరుగారూ! నానెత్తురు తీసుకొని అబ్బాయిని బ్రతికించండి" అంది. కాని డాక్టరుగారూ, యజమానురాలూ కూడా, సుమతి అసలే బలహీనురాలనీ, ఇంకా నీరసించిపోతుందనీ ఒప్పుకో లేదు. కాని సుమతి ఊరుకోలేదు, తన నెత్తురే తీసుకొని వెంటనే పిల్లవాణ్ణి రక్షించండి అని ఏడ్చింది. డాక్టరు, సుమతి నెత్తురు ఆ అబ్బాయి నెత్తురుతో కలిపి "టెస్టు" చేశారు. రెండూ బాగా కలుస్తున్నాయి. అదేముఖ్యంగా కావల్సింది! డాక్టరు

# శ్రీ వికృతినామ సం॥ర పుష్య, మాఘమాసములు.

| | | | |
|---|---|---|---|
| 1951 జనవరి నెల | 16 | మం | న 40-16 అశ్వ 5-17 రావి 3-43 |
| | 17 | బు | ద 44 58 భర 10-42 రావి 16.5 |
| | 18 | గు | ఏ 50.27 కృత్తిక 17-0. దివి 7-22 సర్వేషాం ఏకాదశి. |
| | 19 | శు | ద్వా 5-59 రో 23-31, దివి 1-20 |
| | 20 | శ | త్రయో. 59.40 మృగ 24-58 రా 25-16 శనిత్రయోదశి, |
| | 21 | ఆ | చ 60-10 ఆర్ద్ర 35-59 త్యాజ్యాభావః |
| | 22 | సో | చ 4-36 పున 41-14 దివి 8-36 |
| | 23 | మం | ○ పూర్ణ 8-10 పుష్య 45-28. ది 2.39 |
| | 24 | బు | పా 11-3 ఆశ్లే 48-32 దివి 19-4 |
| | 25 | గు | వి 12-40 మఘ 50-14 దివి 19-23 |
| | 26 | శు | త 12-31 పుబ్బ 50-40 దివి 10-23 |
| | 27 | శ | చ 10-54 ఉత్త 49-57 దివి 28-27 |
| | 28 | ఆ | పం 5-19 హస్త 48-15 దివి 10-21. |
| | 29 | సో | ష 4.44 చిత్త 55-16 ది 45-40. |
| | 30 | మం | అ 4-22 స్వాతి 42.7 రావి 27-12 |
| | 31 | బు | నవ 50-46 విశా 38-39 రావి 19-50. |
| 1951 ఫిబ్రవరి నెల | 1 | గు | ద 44-51 అనూ 34-34 రావి 19-25 |
| | 2 | శు | ఏకా 38-46 జ్యే 30-23 దివి 9-55 |
| | 3 | శ | ద్వా 32-11 మూ 26 21 దివి 22.37. |
| | 4 | ఆ | త్ర 26-47 పూ.షా. 22-39 రావి 13-16. త్రయోదశితిథిః |
| | 5 | సో | చతు 21-51 ఉ.షా. 19-24 రావి 0-42 తిథిద్వయం. |
| | 6 | మం | ● అమా 17-41 శ్రవ 16-51 దివి 26-33. పాడ్యమితిథిః. |
| | | | మాఘమాసం. |
| | 7 | బు | శు. పాడ్యమి 14.32 ధ 14-38 రావి 4-2 మాఘస్నానారంభం. |
| | 8 | గు | వి 12-17 శత 14-42 రా 1-58 |
| | 9 | శు | త 11-10 పూభా 15-21 రావి 11-15 |
| | 10 | శ | చ 12-52 ఉభా 16-58. రావి 20-6. |
| | 11 | ఆ | పం. 14-1. రేవ 19-57 దివి 13-34 మదన పంచమి. |
| | 12 | సో | ష 16-17 అశ్వని 24-11 దివి 13-43. సప్తమితిథిః. |
| | 13 | మం | స 20-1 భర 29.31. దివి 16-13. రథ సప్తమి. |
| | 14 | బు | అ 24-19 కృత్తి 33.58. ది 2-11. అష్టమితిథిః |
| | 15 | గు | నవ 29-11. రోహి 40-11. దివి 18-56. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.




**1951** సం॥ము క్యాలండరు, జి. వి. రెడ్డి & కో "భాస్కరాశ్రమం" గోపాల పురం. తూర్పు గోదావరిజిల్లా. వయా తణుకు. యం. & యస్. యం. రైల్వే.

ఈ కంపెనీవారు చర్మవ్యాధుల మందుల విక్రేతలు. వాని ప్రచురణార్థము అందమైన క్యాలండరును అచ్చొత్తించిరి. సింహద్వయముల పూన్చిన రథము నెక్కిన దేవతా విశేషమిందు త్రివర్ణముల ముద్రితము. ఈ దేవి చతుర్భుజ. ఒకచేత శంఖము, మరొకచేత పైకెత్తిపట్టినజ్యోతి, వేరొకచేత భారతజాతీయ పతాకము, నాల్గవచేత పగ్గములు. అట్టపేపరునందు బొమ్మక్రింద 12 మాసములును వరుసగా ముద్రింపబడినవి. కోరినంతనే క్యాలండరు సంప్రుదురట.

రాష్ట్రగీత : చదలువాడ కోటి నరసింహముగారు. చంద్రికా పబ్లిషింగుకో., గుంటూరు. వెల రు 0-2-0 లు.

ఇందు 40 పద్యములు; ఆటవెలదులు, తేటగీతలు. కవి ఒక్కొక్క పద్యమున, ఆ నాల్గు పంక్తులలోనే బ్రహ్మాండమంత అర్థమిమిడ్చి ఒక్కొక్క పద్యమొక్క భావమును పూర్ణముగా తెల్పునట్లు వ్రాయబడినవి. రాట్నము, ఖద్దరు, అహింస, హరిజనులు ఇత్యాది ఆధునిక సమస్యల నొక్కొక్కటి నొక్కొక్క పద్యమున వివరించినారు. బాలబాలికలకు పాఠశాలలందు పఠనీయగ్రంథముగా నిర్ణయింపదగినది. అట్టి ఆదరణ పొందకయే ఇది 6 సం॥లలో మూడు ముద్రణముల గాంచినదనగా ప్రజాదరణ ఎంతగా చూరగొన్నది తెలియగలదు. కవిత్వము మంచినీళ్ల మర్యాదగా నడచినది.

రత్నత్రయ : గ్రంథకర్త శ్రీ బులుసు వెంకటేశ్వరులుగారు. బి. ఏ. రామారావు పేట, కాకినాడ, వెల రు 1-0-0.

శ్రీరామతీర్థస్వామి, సర్. సి. వి. రామన్, పండితరాయలు - ఈ ముగ్గురి జీవితములిందుపొందు పరచబడినవి. జీవితచరిత్రలు వ్రాయుటలో శ్రీ వేంకటేశ్వర్లుగారు సిద్ధహస్తులు. అయితే ఈ శతాబ్దారంభముననే గతించిన రామతీర్థస్వామిని, సుప్రసిద్ధ వైజ్ఞానిక శాస్త్రవేత్తయై, నోబిల్ బహుమానమంది చిరంజీవియై ఇతోధిక పరిశోధనల మెరయుచున్న సర్. సి. వి రామన్ గారిని, 16-వ శతాబ్దమున రాణించిన పండితరాయలను గుదిగుచ్చిన వెంకటేశ్వర్లుగారి అభిప్రాయము ఊహాతీతముగనున్నది. విద్యార్థుల కుత్తమ బుద్ధులనేర్ప దీనిని రచించితినని గ్రంథకర్తగారనుచున్నారు. వీరి గ్రంథములకొన్నిటిని ఇదివరలోనే పాఠ్యపుస్తక నిర్ణయ సంఘము వారనుమతించియున్నారు. ఇదియు నాగౌరవము బడయుచో గ్రంథకర్త ఆశయము నెరవేరగలదు.

సంపాద్యపరుడైన ప్రయోజకుడు అకాలమరణం చెందితే, కుటుంబమంతా అన్నోదకాలకు అలమటించకుండా ఆధరువు ఏర్పడగలందులకు, అతడు తన సంపాద్యంలోనుంచీ కూడబెట్టగా కంపెనీవారి దయ కూడా చేరి ఏర్పడ్డనిధి. మిగతప్రయోజనాలన్నీ దీనితరువాతవే. నిజమాలోచిస్తే 'గృహలక్ష్మి'కిది ఎంతో అవసరమైనదైనా ఆమాట యెత్తితే ఏదో వాగాయిత్యమనునట్లు హడిలి దాన్ని ప్రోత్సాహించరు. ఇల్లాలు, తనకు తనబిడ్డలకు కావలసినవన్నీ భర్తచేత కొనిపిస్తుంది. కాని దైవం చిన్నచూపుచూస్తే తనగతి, పిల్లలగతి సుకరమొనర్చి, భీమా చేయమని ప్రోత్సాహించదు. మొదటి అవసరాలు ఎదుటివి; రెండవ అవసరము రేపటిది. రేపటిసంగతి ఆలోచించడంకూడా అవసరమే. కాబట్టి గృహలక్ష్మి కత్యవసరమైన ఈ భీమాపద్ధతి వ్యాపారం భారతీయకంపెనీలు ఈ సం॥ ము ఇదివరకుకన్నా హెచ్చుగా చేసినవనే వార్త సంతోషదాయకముకదా. 1949 లో 5,44,000 మంది భీమాచేశారుట. వీరు మొత్తం రు 135,35,00,000 లకు భీమా చేశారట. వీరు సాలీనాకట్ట నొప్పుకున్న ప్రిమియం మొత్తం రు 7,47,00,000 లు గత సాలుకన్నా భీమాదార్లు 59,000 ఉన్నూ భీమా మొత్తం రు 15,45,00,000 న్నూ వృద్ధిఅయినది. విదేశపుకంపెనీలున్నూ కొత్త భీమావ్యాపారం చేశాయి. ఇవి రు 12,22,00,000 లకు 18,000 పాలిసీలు సేకరించినవి. పాలిసీలు కొంతతగ్గినా మొత్తము కొంచము హెచ్చినదట. భీమాధనం కుటుంబములకు భవిష్యత్కాలంలో క్షేమనిధి కావడమేగాక, దేశానికికూడా విలువైన నిక్షేపములలో నొకటి. మొదటి ప్రపంచయుద్ధములో భీమాధనమే ఇంగ్లాండును జయంచేకూర్చినది. కాబట్టి ఇల్లాండ్రు ఇంకా తమ మగవారు భీమాచేయకుంటే, చేయుమని పట్టుపట్టడమేకాదు; స్వదేశీకంపెనీలో చేయమనికూడా కోరాలి.

# సంపాదకీయములు

## చేనేత పరిశ్రమ

చేనేత పరిశ్రమ చాల పురాతనమైన భారతీయ కుటీరపరిశ్రమ. ఈ పరిశ్రమలో ఒక్క విశేషమున్నది. దీనికి కుటుంబమంతా పనిచేస్తారు. పడుగు అతకడంలో, సరిచేయడంలో, కండెలు చుట్టడంలో, నేయడంలో అన్నిట పురుషునితోపాటు స్త్రీయున్నూ పాటుపడుతుంది; బాలబాలికలు కూడా చిలపలుపోయడం, కండెలు చుట్టడం మొదలైన చిన్నచిన్న పనులు చేస్తారు. పురాతన కాలంలో మిల్లులులేని రోజులలో, పత్తినిడవడం, విత్తుతీయడం, ఏకడం, ఏకులుచుట్టడం, నూలువడకడం, రంగులువేయడం ఇవన్నీ దీని ఉపపరిశ్రమలు; ఇవీ కుటీరపరిశ్రమలే. వీటిలో చాలా స్త్రీలుచేసేవే. ఈవిధంగా మానవులకు ముఖ్యావసరాలైన అన్నవస్త్రాలలో నొక్కటైన వస్త్రపరిశ్రమ ఇంటిని, ఇల్లాలిని అంటియున్నది. నేడు మిల్లులే హెచ్చుగా నీమగ్గాలకు నూలుసప్లైచేస్తున్నవి. గాంధీమహాత్ముని దయవల్ల చావుబ్రతుకులతోనున్న ఖద్దరు పరిశ్రమ కొంచం ఊపిరిపోసుకొన్నది. కాని నేడు ఖద్దరుస్థితి మందగించింది; అభిమానం సన్నగిల్లుతున్నది. మిల్లులున్ను తమకు కాగా మిగిలినది హెచ్చుగా విదేశాలకు ఎగుమతిచేసి విశేషలాభాలు సంపాదించుకుంటూ, చేనేత మగ్గాలకు అరకొరగా సప్లైచేస్తున్నాయి. మనదేశంలోఉన్న మగ్గాలు ఇన్నీ అన్నీ కావు; 25,00,000 మగ్గాలు. వీనిపై పనిచేసిబ్రతికేవారు 1,25,00,000 మంది. ఒక్క ఆంధ్రదేశంలోఉన్నవి - సుమారు 2,00,000. మగ్గాలు అంటే 10,00,000 మంది పనివాండ్రు. తగినంత నూలుసప్లైలేక ఈ మగ్గాలలో చాలా మూలపడ్డాయి; పలువురు పస్తుంటున్నారు. దేశమంతటా వీరిగోల హెచ్చైనది. ఆకలియాత్రలు, ప్రభుత్వం వారికి వినతిపత్రాలు మిక్కుటమైనాయి. గృహలక్ష్మి, ఆమెబిడ్డలు ఇల్లుకదలకుండా భర్తకు బాసటయైనిల్చి కుటుంబపోషణకయ్యేట్లు చేయగల ఈవృత్తిని నిలువబెట్టడం ప్రభుత్వధర్మం. ముఖ్యంగా ఇది స్త్రీ సమస్య. మహిళాసంఘాలు ఈ సమస్యనుచేబట్టితే జయముండకపోవు. వారు రాట్నం చేబట్టడంకూడా ఈమగ్గాలవారికి సహాయకారి.

## తయారీదుస్తుల ఎగుమతి

మనదేశంలో వస్త్రం చాలకపోయినా ఇతరదేశాలకు కొంతవస్త్రం ఎగుమతిచేయక తప్పడంలేదు. ఇతర దేశాలలో మన బట్టకుగల మార్కెట్టును నిలుపుకోడానికది అవసరంకూడా. అయితే ఒక్క మన దేశంలోనే ధోవతులు, చీరలు, పైపంచలు అని విడివిడిగావస్త్రాలు ధరించేది. మిగత అన్నిదేశాలలోను కుట్టినదుస్తులే ధరిస్తారు. కాబట్టి ముడిగుడ్డ ఎగుమతి చేసే బదులు, తయారీదుస్తులు ఎగుమతులు చేయడంవల్ల మన దేశీయులకు కొంత బ్రతుకు తెరువుఏర్పడుతుంది అని మద్రాసు (డెస్ మేకర్స్) అసోసియేషన్‌వారు చేసేప్రచారం హర్షింపదగినది. మనదేశంలోకూడా ఇది చాల అనుకూలమైనది. ఎంత ఖచ్చితంగాకొన్నా దుస్తులు కుట్టించుకొన్నప్పుడు మిగులుతెగుల్లు తప్పవు. తాను మొత్తంగాకొని దుస్తులుకుట్టి అమ్మితే ఖర్చు కొనేవారికి కలిసివస్తుంది. ఈ ఉద్యమం అమలుజరిగితే స్త్రీలకు మంచి బ్రతుకుతెరువు ఏర్పడుతుంది. స్త్రీలు చేతిమిషన్లపై తమఇండ్లలోనే వీటిని కుట్టవచ్చు. కాబట్టి ఈ ఉద్యమానికి ప్రభుత్వంకూడా ప్రోత్సాహమివ్వదగునని కోరుతున్నారు.

## భీమా

'లైఫ్ ఇన్సూరెన్సు' అనే ఆంగ్లపదానికి 'భీమా' అని నేడు తెలుగుపదాన్ని వాడుతున్నారు. ఎన్నిరకాల స్కీములు ఏర్పడ్డా తొలుత ఎవరన్నారో, అది ముఖ్యంగా 'చావుఫండు.' అంటే సంసారంలో

# సామెతలు

936. తడిసికాని గుడిసె కట్టడు, తాకికాని, మొగ్గడు.

937. తిట్టిచచ్చినవాడు, దీవించి, బ్రతికినవాడును లేడు

938. తంటలమారి గుఱ్ఱమునకు తాటిపట్టె గొరపము.

939. తాటోటుగానికి దధ్యన్నము; విశ్వాసముగల వానికి వేడినీళ్లు అన్నము.

940. తాను మ్రింగేది, తనను మ్రింగేది చూచుకోవలెను

941. తిరుపతికిపోయిన తురక దాసరియగునా?

942. తేళ్లలో కొండి, పాములలో పడిగ.

943. త్రాడు చాలకుండిన నూయి పూడ్చుమన్నట్లు.

944. తియ్యగా తియ్యగా రాగము, మూలగగా మూలగగా రోగము.

945. తానేతుమ్మి తానేశతాయుస్సు అనుకొనినట్లు.

946. తేనెయున్నచోట ఈగలు పోగవును.

947. తండ్రిసేద్యము, కొడుకువైద్యము, కూడు మద్యము.

948. తలారిపగ తలతో తీరుతుంది.

949. తేనెతుట్టె పున్నమకు పూత, అమావాశ్యకు ఆరగింపు.

950. తొలకరిచెరువు నిండినా, తొలిచూలు కొడుకు పుట్టినా లాభము.

951. పేదవాని కోపము పెదవికిచేటు.

952. పెద్దలు పెట్టినదిపేరు, ప్రేమతో పెట్టినది ఊరు.

953. పేరుపెద్ద, ఊరుదిబ్బ.

954. పేదవాండ్రకు ప్రతిదీసంతోషము.

955. పీనుగులు మోసేవారికి, అకులు బరువా?

956. పచ్చకామెర్లకు పల్చని మజ్జిగయే పథ్యం.

957. పడిశానికి మందు నిరర్థకము.

958. పదును తప్పినా, అదును తప్పినా, పన్ను దండుగ.

959. పడుచుల సేద్యము పాకానికిరాదు.

960. పులికడుపున జలిచీమలు పుట్టునా?

961. పెదిమకు మించినపల్లు, ప్రమిదకు మించినవత్తి.

962. పలుచనిపైరు పాతరలు నిండును.

963. పాలేరువానికి గొడ్డుపోయినను; మారుతల్లికి బిడ్డపోయినను బెంగలేదు.

964. పంట పెంటలోనే యున్నది; పాడియూరిలోనున్నది.

965. పల్లము దున్నినవాడు, పల్లకీ నెక్కువాడు సమానము.

966. ప్రొద్దుననె వచ్చిన చుట్టము, మధ్యాహ్నము వచ్చిన మబ్బు నిలువవు.

967. పాలు చిక్కనయితే వెన్న వెక్కసము.

968. పిల్లి కన్నులుమూసి పాలుత్రాగుచు తన నెవరు ఎఱుగరని తలచురీతి.

969. పచ్చనిదెల్ల బంగరము కాదు.

970. పిల్లికి ఎలుకసాక్షి.

971. వచ్చుకాలముకంటె, గతకాలము మేలు.

972. వేటుకువేటు. మాటకుమాట వుండవలెను.

973. వెఱ్ఱి వేయివిధాలు, పైత్యము పదివేలవిధాలు.

974. వెలికిలపరుండి ఉమ్మితే తన మొఖముమీదే పడుతుంది.

975. వట్టిగొడ్డు కార్పులెక్కువ; వానలేని మబ్బు ఉఱుము లెక్కువ.

976. మొక్కై వంగనిది మ్రానై వంగుతుందా.

977. ముందొచ్చిన చెవులకన్నా, వెనకొచ్చిన కొమ్ములువాడి.

978. మంచి మాటలతో మామిడికాయలురాలవు.

979. మనిషికి ఒకమాట, జంతువుకు ఒకదెబ్బ.

980. మానవసేవయే మాధవసేవ, గోసేవయే గోవిందసేవ, హరిజన సేవయే హరిసేవ.

981. మనోవ్యాధికి మందులేదు.

982. మతిలేనమ్మకు, గతిలేనిమొగుడు.

983. మడికిగట్టు, ఇంటికిగుట్టు మంచిది.

984. మానముపోయినవెనుక ప్రాణమెందుకు?

985. మనిషికి ఉన్నదిపుష్టి, పశువుకు తిన్నది పుష్టి.

# ఆఁడుతోడు గోడు

శ్రీమతి చదలవాడ నాగరత్నముగారు

పెండ్లి పీఁటలమీఁద పెద్దలు చదివించు పౌలము ఫలమ్మునకై పోరు నొకఁడు
పసుపుఁ గుంకుమ గౌరవమ్మునకై తలిదండ్రు లిడ్డభూమిని విక్రయించు నొకఁడు
పండుగపబ్బాల కుండమర్యాదలు దండిగా లేవని మండునొకఁడు
అక్క - చెల్లెండ్రును కగ్గులో త్తకయున్నఁ గుత్తుక గట్టిగా నొత్తు నొకఁడు
కట్ట! కనుపట్టదా? మగదిట్టచెట్ట మూఁడు పూలాఱు కాయలతోడనుండు
కూళచేఁతల కెన్నాళ్లు తాళవలెనొ! కూడునే నేఁడు మా ఆఁడుతోడుగోడు.

# వరకట్నము

జడ్డక్కరంబు నుడువఁగ గడ్డగు మగవాఁడు వేలకట్నం బడుగున్
ఒడ్డుం బొడుగుం గలిగిన యెడ్డెమొకంబంచుఁ బరిహసింపరె విబుధుల్?
ఎన్నో వందలు వేలిడి ఉన్నత విద్యాలయమున నున్నందునఁ జే
కొన్నావా వైదుష్యం? బన్నా! వరకట్నవాంఛ యర్థం బగునా?
వరకట్నం బరికట్టఁగాఁదలఁచి, కావ్యాలెన్నొ సృష్టించి చి
త్తరువుల్ చూపిరి; ప్రొద్దుపుచ్చెదు నిమిత్తంబయ్యె నాచేఁత; లె
వ్వారు పాటించిరి? ఘోరశాసనము సల్పంగావలెన్ సంఘ సం
స్కరణాసక్తులు మంత్రిపుంగవులు వేగన్ భారతక్షోణిలోన్.

## సాధనావారి "సంసారం"

సాధనావారి "సంసారం" అనే ఫిల్ము ట్రేడ్ షో 4-1-51 శ్రీకృష్ణసినిమా హాలులో ప్రదర్శింపబడినది. పట్నవాసంలో పచ్చగా ఉన్న రఘు సంసారంలో అత్త, ఆడబిడ్డవచ్చి చిచ్చు పెడ్తారు. రఘు అప్పులపాలై ఉద్యోగంపోయి, మతిపోయి దేశాలపాలవుతాడు. వదినె నాదుకోను వచ్చినవేణుతో అపవాదుపాలు కాగా వదినె తెగురు బిడ్డలతో తాను ఇల్లువదలి వెళ్ళిపోతుంది. వేణు యాదృచ్ఛికంగా పరిచయమైన ధనవంతుని కూతురు కమలను స్నేహమై అన్నవదినెల వెతకడమారంభిస్తాడు. కమలా వేణుల వివాహం కమలతండ్రి అంగీకరించినా అన్న, వదినె కన్పించేదాక ఆగమంటాడు వేణు. రఘు భార్యబిడ్డలు తిరిగితిరిగి ఒక చల్లని ఇల్లాలు ఆశ్రయాన తల దాచుకుంటూరు. బిడ్డలు కొన్నాళ్లు బిచ్చమెత్తి తల్లిని పోషిస్తారు. తర్వాత పెద్దబిడ్డ అభిమానంవేసి - కమలతండ్రి ఘరములోనే పనికి కుదురుతాడు. పిచ్చివాడై తిరుగుతున్న రఘు తన కుమారునివద్దనే - తెలేక - యాచించి యెంగిలి అన్నం తినడంలో పొత్తు కలుస్తుంది. రఘుకు చలి జ్వరం వస్తుంది. కొడుకు కనికరించి ఇంటికి తీసుకెళ్లుతాడు. రఘును భార్యగుర్తించి ఆనందిస్తుంది. మందిప్పించడానికి డాక్టరు దగ్గరకు పోతుంది. అతడు డబ్బులేనిది రానంటాడు. ఆమె సుందరరావు (కమలతండ్రి) వద్దకువెళ్లి తన బిడ్డకూలిపై అప్పు ఇమ్మంటుంది. అతడు లేదంటాడు. 7 సం॥లకు దొరికిన భర్తను బ్రతికించుకోవలె ననే ఆత్రంతో ఆమె సుందరరావును దోకురుపారతో ఒక పెట్టుపెట్టి జేబులో పర్సులాక్కుపోయి డబ్బు డాక్టరు కిస్తుంది. ఫోనుమీద పిలువగా డాక్టర్ సుందరరావు ఇంటికి పోయివస్తానంటాడు. ఆమె డాక్టరు గొంతుపట్టుకొని బలవంతంచేసి తన ఇంటికి గొంపోతుంది. భర్త బ్రతుకుతాడు. కమల తండ్రిమీదఘాత నేరం వేణుపై మోపుతుంది. అదితెలిసి రఘుభార్యవెళ్లి తాన్ని ఒప్పుకుంటుంది. అంతవరకు ఒప్పుకొనని వేణు వదినెను తప్పించను నేరస్థుడు తానే అంటాడు. వదినె పరస్పరసాక్ష్యం చూపుతుంది, డాక్టరు సుందరరావులు వస్తారు. డాక్టరు డబ్బుతెమ్మని నిక్కచ్చిచేసిన తానే నేరస్థుడనంటాడు. ఆమె ఆర్తి తెలియనేరని తానే దోషినని సుందరరావు అంటాడు. ఆఖరుకు కేసుమాపు అవుతుంది. వేణు నిశ్చయం ప్రకారం అన్న, వదిన కన్పించగానే వారి వివాహ మవుతుంది. "సంసారం"లో అత్తలు, ఆడబిడ్డలు పెట్టేతంపులు; బాంధవ్యంచేత సంసారులు వాటిని భరించ ప్రయత్నించి పడేభంగపాట్లు - చక్కగా ఈ చిత్రంలో అమర్చబడినవి. నిజంగా శ్రద్ధతో ఉత్తమ సాంఘిక చిత్రం తీయను చేసిన ప్రయత్నమిది. సామాన్య ప్రజాకర్షణీయమైన డాన్సులు మొదలైన వింధు లేకున్నా కథ సహజంగా నడిచింది. రఘు, వేణు, పాత్రలను రామంరావు నాగేశ్వరరావుగార్లు చక్కగా నిర్వహించారు. రఘు భార్యగా లక్ష్మి, రాజ్యం అద్భుతంగా నటించింది. రఘు బావమరదిగా 'రేలంగి' చిత్రానికంతా జీవంపోశాడు. కథకుడు, డైరక్టరు, ప్రొడ్యూసర్ - చిత్రాన్ని సుఖాంతం చేయాలని పారదబ్బతిన్న సుందరరావును బ్రతికించారు. కాని, దైవము ప్రొడ్యూసర్ కే. వి. కృష్ణగారిని, తిరుపతి మ్రొక్కు చెల్లించుకవచ్చి చిత్రం విడుదల చేతామని వెళ్లుతున్న వారిని, దారిలోనే రేణిగుంటవద్ద మృత్యుముఖానత్రోసి చిత్రాన్ని విషాదాంతం చేశాడు!

—మూసినీఫాక్.





శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు హైదరాబాదు సంస్థానంలో విద్యాశాఖామాత్యులు. ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఆంధ్రవిజ్ఞానోత్సవములకు ప్రారంభోత్సవము సలుపుతూ ఇట్లా ఆంధ్ర విద్యార్థులకు సలహా యిచ్చినారు:—

ఆంధ్రులమైన మనకు రెండు ముఖ్యమైన లోపాలున్నవి; ఒకటి మనకు పట్టుదలలేదు. రెండు చిన్నచిన్న ముఠాలుగా ఏర్పడడంకూడా మనలక్షణం. ఈ రెండు లోపాలను మనము పోగొట్టుకొంటేనే గాని - భారతదేశంలో ఇతరులతోపాటు అన్ని విధాలా కూడి నడిచి అభివృద్ధికిరాలేము.

లక్నో విశ్వవిద్యాలయమున విద్యార్థులకుపన్యసించుచు బొంబాయి గవర్నరు శ్రీ రాజామహారాజసింగుగారు, రిపబ్లిక్ ఆరోగ్యమంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ తండ్రిగారు.-"బాలబాలికలను చేర్చి విద్యాలయములు సాగించుట మీకిష్టమేనా?" అని అడిగిరట. అప్పుడు బాలురందరు ఏకకంఠముగా సమ్మతిని తెల్పిరట; కాని బాలికలు మౌనమువహించిరట. అందుకాశ్చర్యచకితులై శ్రీమహారాజసింగుగా రిట్లనిరి:—

"బొంబాయిలో అభిప్రాయము వేరుగావున్నది. ఇట్లేబొంబాయి విద్యార్థినులను ప్రశ్నింపగా 100 కి 90మంది విద్యార్థినులు తమ సమ్మతిని తెలియపరచిరి."

భారతపార్లమెంటులో - 'ఖద్దరు' అనే పదమును నిర్వచిస్తు ఒక బిల్లు తేబడినది. ఆ నిర్వచనంలో 'అస్సాంపట్టు' అనికూడా చేర్చుమని కోరుతూ శ్రీ రోహిణీకుమార్ చౌదరిగారిట్లా అన్నారు:—

"ఇతర రాష్ట్రాలలో ఈనాటి కన్యకలు మంచిమగనికోరి యువకుల నాకర్షించను పెదవులకు ఎర్ర రంగు వేసుకొంటున్నారు; జార్జెట్ చీరలు కట్టుతున్నారు. అస్సాంలో కన్యలు అలాకాదు; తగిన భర్తను బడయడానికని పట్టుదారము వడుకుతారు."

మద్రాసులో ఈ సం॥ము జరుగుచున్న పార్క్ ఫేర్, వస్తుప్రదర్శనములకు ప్రారంభోత్సవంచేస్తు సచివోత్తమ సర్. సి. పి. రామస్వామి అయ్యర్ గారు కుటీర పరిశ్రమలనుగూర్చి ఇట్లా చెప్పినారు:—

స్విజర్ లాండులో విద్యుచ్ఛక్తి సహాయాన జరిగే పరిశ్రమల కన్నిటికి గ్రామమే కేంద్రం. నేర్పుతో తయారైన నేటి చేతిగడియారం అక్కడ కుటీరపరిశ్రమ. అక్కడ గ్రామాలకు ఎంతో విద్యుచ్ఛక్తి సరఫరా అవుతున్నది. అందుచేత కుటీరాలలోనే మెయిన్ స్ప్రింగులు, డయల్స్, ఇంకా చేతిగడియారమందలి ఇతరభాగములు తయారుచేస్తారు. గవర్నమెంటు సంస్థలుగాని, సహకారపరపతి సంస్థలు గాని పెద్దవర్తక సంస్థలుగాని సం॥మున కొకసారో, రెండుసార్లో వీనినన్నిటిని జమచేసుకొని వెళ్ళి కేంద్రములలో విడిభాగములను జతగూర్చి చేతిగడియారాలను తయారు చేస్తారు. అదుగో ఆ విధంగా భారతదేశం అభివృద్ధి గాంచవలెను. అయితేఅర్ధాకలితోను, నిస్సారపు తిండితోను బాధపడేవారిని పరిశ్రమలవంకకు మరల్చజాలము.

# లెక్కింపు ప్రయోజనమైన ఆహారం



శిశుత్వంలో పెరుగుదలమీదనే, భావిజీవితంలో ఆతని దేహస్థితి ఆధారపడియుంటుంది. కనుకనే తల్లి కనక మునుపూ, కన్న పిదప పాలిచ్చి పోషించుచున్నంతకాలమూ శిశువుకు ఆరోగ్యవంతమైన పెరుగుదలనిచ్చే ఆహారం భుజించడం అత్యవసరం.

నేడులభించే ఆహారంలో, శరీరాన్ని క్రమపద్ధతిలో పెంచే విటమిన్లు చాలాకొరతగా వున్నాయి. కనుక, తల్లి అధికంగా విటమిన్లు తీసుకోవాలి, లేదా, బిడ్డ అతి బలహీనంగా జన్మిస్తుంది. అటువంటి బిడ్డను పెంచిపోషించడం మరీకష్టం. పెద్ద వారికి కావలసిన 'ఏ.డి.' విటమినులు రోజుకొక అర్ధణా ఖర్చుతో, "ఎమ్. జి. బి." (మద్రాసు గవర్నమెంటు బ్రాండ్) షార్క్ లివర్ ఆయిల్ వలన లభించును. శిశువులకు రోజుకు ఒక కానీ మాత్రమే అవుతుంది.

## మద్రాసు గవర్నమెంటు బ్రాండ్




## షార్క్ లివర్ ఆయిల్

పెద్దవారికి – ఖరీదు రోజుకు అర్ధణా

### ఎడామిన్

శిశువు జన్మించిన క్రొత్తలో, (మద్రాసు గవర్నమెంటువారి) షార్క్ లివర్ ఆయిల్‌లో ఉండే క్రొవ్వు పదార్థాలు, అతిసుకుమారంగాయుండే జీర్ణశక్తికి అంతగా పడక పోవచ్చు. అట్లయిన, నిర్జలమైన ఎడామిన్ ఇవ్వండి, ఏ బాధాయుండదు. రోజుకు కొద్దిచుక్కలు మాత్రమే చాలు.

* విటమిన్ 'ఏ': శారీరపు పెరుగుదలను పెంపొందించును. రొంప, ఆటలమ్మ, పొంగు, గాలి బిళ్లలు మొదలయినవి రాకుండాను, ఒరిసినందువల్లా, కోసుకొన్నందువల్లా కల్గిన గాయాలద్వారా అంటువ్యాధులు రాకుండా కాపాడును.

* విటమిన్ 'డి': దొడ్డి కాళ్లు రాకుండా చేయును. ఎముకలు, పంటి వరుస దృఢంగా పెరిగి పెంపొందేటందుకు, యిది ముఖ్యావశ్యకము.

క్రొవ్వు పదార్థములు: విటమినులను పూర్తిగా జీర్ణము చేసికొనుటకు, శరీరమునకు అదనంగా శక్తిని కలుగచేసే ఆహారము నిచ్చుటకు, తగిన పేరుకపగనూనె యిందున్నది.

## గవర్నమెంట్ ఆయిల్ ఫ్యాక్టరీ, కాలికట్

పారిశ్రామిక, వాణిజ్య శాఖ

## మద్రాసు ప్రభుత్వము

దక్షిణ భారతదేశమునకు డిస్ట్రిబ్యూటర్లు:
పారీ అండ్ కంపెనీ లిమిటెడ్ మద్రాసు.

SISTA'S-GO-5 D - Telugu

# మద్రాసు ఆస్థానాంధ్రకవి ప్రశంస



"కవిచంద్రులు" శ్రీ కోట సోదరకవులు (అష్టావధానులు)

గోదావరీ తీర కేదారముల్ పండ కవితాప్రవాహ సత్కావ్యవృష్టి,
బోధించుటే కాక భోజరాజుల చేత దనియించు శిష్యవాత్సల్యగరిమ,
పలుకుఁదియ్యఁదనానఁ జలఁబూపఁజేసిన యష్టశతావధానాదిమహిమ,
నరిఁజూపఁగారాని సంస్కృతాంధ్రమ్ములం దకలంక సార విద్యాబలమ్ము,
మొదలుగాఁగల సద్గుణమూర్తివగుట, ప్రేమ "ఆస్థానకవి పదవీలలామ"
కేలుఁగీలించె మీతోడ! కృష్ణమూర్తి శాస్త్రివర్యా! ఇవే నమస్కారశతము.

శ్రీ తన వక్షమందు వసియించుటచే హరి విష్ణువయ్యె, నా
శ్రీ తన కంఠసీమను ధరించుటచే హరుఁడీశుఁడయ్యె, నా
శ్రీ తమ వామభాగమును జెందుటచేత, ప్రభుత్వసత్కవి
శ్రీ తనరారనుండుట విచిత్రముకాదు తలంచి చూడఁగన్॥

మువ్వురు పూర్తిఁజేసిన యమోఘపు భారత మాంధ్రభాషగాఁ
గవ్వడి బాణవేగమును, గాంగనదీ లహరీవిధానమున్,
నవ్వెడు ఫక్కిఁ వ్రాసి, సుజనస్తుతిఁగాంచిన సత్కవీంద్ర! మీ
కెవ్వరు బోలఁజాలరు, మహిస్థలి తేనియలూరు శైలికిన్.

తెలుఁగుందోటలఁ గావ్యమంజరుల నుద్దీపించు బూఁదేనె, వా
కలఁజిందించి, రసజ్ఞభృంగములు వేడ్కన్ మెచ్చఁగాఁజేసి, య
ప్పలుకుందొయ్యలి పాదకంజముల సేవంజొక్కునో తెల్గు కో
కిల! మీస్వాదు "కుహూ" రవంబు లెదలోఁ గీర్తింతు మశ్రాంతమున్.

నాసిక్‌లో ఒకడు క్రొత్తపద్ధతిని పత్రికలమ్ముచున్నాడు. పెద్ద రోడ్డుప్రక్కన కాలిబాటపై ఒక బల్లనుంచి దానిపైకొన్ని పత్రికలు, డబ్బులపెట్టె పెట్టుచున్నాడు. పత్రిక కావలసినవారు తీసుకొని దానిపైనున్న ధర ఆ పెట్టెలో ఉంచి పోవలయును అని యొక ప్రకటన నక్కడ వ్రేల కట్టుచున్నాడు. నిన్న అమ్ముడుపోయిన పత్రికలసంఖ్య నా ప్రకటన కాకితముపై వ్రాయుచున్నాడు. 12 రోజులు ఈ పద్ధతిని నడిచినను అతనికొక పైస నష్టములేదుట. ప్రజలలో "నీతి"ని వృద్ధిపరచుటకిది ప్రత్యక్ష విధానమని అతడనుకున్నాడు. ఈ పద్ధతి విదేశముల కలదని విన్నాము.



కొరియాలో లేతబుగ్గల బాలబాలికలు దిగంబరులై వట్టిపాదాలతో చలికి గడగడవడకుతు చేతులు జోడించి బిక్షమెత్తుకుంటూన్నారు. తండోపతండాలుగా, పెద్దవాళ్లు రాత్రిళ్లు నగరాలలో దూరి ఆకలి తీర్చుకోనుహత్యలు దొంగతనాలు చేస్తున్నారు. డబ్బు విలువనశించింది; ఎంత డబ్బిచ్చినా అన్నం దొరకదు. అంచేత పేద ధని అనేభేదం నశించింది.

వీరు అందరుముందుకు సాగిపోయి నిలువ తావులను వెతుక్కోవలసి ఉంది. అక్కడికి ముందే చేరిన సైన్యం ప్రతి అంగుళం స్థలం, స్కూలు, చర్చి, ఫ్యాక్టరీ, థియెటర్ అన్ని ఆక్రమించుకొని ఉన్నారు. ఇక ఖాళీజాగాలులేవు. అంచేత గడ్డి చాపలు పంచిపెట్టుతారట. ఈ చలిలో అవే ఆచ్ఛాదన.



ఇంగ్లాండులో బొగ్గు ఉత్పత్తి తగ్గింది. అక్కడ చలి హెచ్చుగా ఉన్నది. ఇండ్లలో అగ్గి నెగళ్లుంచుకోకపోతే, వారు భరించలేరు. ఈ అవాంతరంగడవడానికి బొగ్గుగనుల ప్రతినిధులతో ప్రధానమంత్రి అట్లీ సహాకొందరు మంత్రులు సంప్రతించారు. ఏప్రిల్ నెలాఖరుకు 30,00,000 టన్నులబొగ్గు హెచ్చుగా ఉత్పత్తి చేయకపోతే ప్రమాదకరమని బొగ్గుగనులవారిని ప్రధాని హెచ్చరించాడు. కార్మిక ప్రభుత్వం నేడుతుమ్మితే ఊడేముక్కువలె ఉన్నది. 1947 లో వలెనే బొగ్గుకరవు ఏర్పడ్డదంటే - అక్కడదే వంటచెరుకు - కార్మిక ప్రభుత్వం అంతరించక తప్పదని అట్లీప్రధాని అన్నాడు. కార్మికప్రభుత్వం ఉండాలని కోరేబొగ్గుగనుల కార్మికులు అంతపని కానిస్తారా ?

---

(7 వ పుట తరువాయి)

## మా తపాల్ పెట్టె

పాకకళ, బ్రతుకుతెరువు, గృహవైద్యము, ఇంటిపనులలో మెళుకువలు - అను నాలుగు శీర్షికల క్రింద ప్రతినెల ఏదో ఒకొక్క క్రొత్త సంగతి యథారీతి గురించి ప్రచురించుచున్నాము. మా రచయితలే ఆయా సంగతులగూర్చి వ్రాసినఎడల వారివారి పేర్లతో ప్రకటించెదము. కావున మా రచయితల నిందుకు హెచ్చరించుచున్నాము. ఈ మధ్యనిలిపిన సామెతలు తిరిగి ప్రకటించుచున్నాము. దీనికికూడా తగిన ప్రోత్సాహం చూపెదరని ఆశించుచున్నాము.

గృహలక్ష్మి మా సపత్రికలో డాక్టరు కే. యన్. కేసరిగారు, "నాచిన్ననాటి ముచ్చట్లు" అను శీర్షికక్రింద, వారి 70 సం|| జీవితములోని అమూల్యమగు అనుభవములను ప్రతినెలా కొద్దికొద్దిగా చదువరులకు గృహలక్ష్మిద్వారా బోధించుచుండిరి. ఈ విధముగా మూడు సంవత్సరములపాటు వారి ఆత్మకథను ప్రకటించిరి. వీరి "చిన్ననాటి ముచ్చట్లను" ప్రతియొక్కరు చాలా శ్రద్ధతో చదువుచుండిరి. 1950 సం|| జూలై నెల గృహలక్ష్మిలో "ముచ్చట్లు ముగింపు" అను వాక్యము చాలమందికి బాధకలిగినట్లుగా మాకు వచ్చిన జాబులనుబట్టి తెలియుచున్నది. దానిని నిలుపకుండ మరల వ్రాయమని కోరిరి. మరికొందరు వీరి చిన్ననాటి ముచ్చట్లను ఒక పుస్తక రూపములో తయారు చేయించమని వ్రాసిరి. శ్రీ కేసరిగారు ఆ యత్నములోనే యున్నారని తెల్పుటకు సంతసించుచున్నాము. మా రచయితలందరూ ఎప్పటియట్లు మాకు సహకారమిచ్చి తోడ్పడుదురని ఆశించుచున్నాము.

ఎమ్. సుశీల.

# లోక వార్తలు

బొంబాయి ప్రభుత్వం జైళ్ల సంస్కరణలో క్రొత్త పద్ధతి అవలంబింప తీర్మానించుకున్నారు. ఒకటి రెండేండ్లు జైలులోగడిపి ఇంకా ఒక సం॥ము పైగా ఉండగానే బుద్ధిమంతుడనిపించుకున్న వాడిని విడుదలచేసి ఔంధు సంస్థానంలో ఒకప్రదేశాన వ్యవసాయం చేయమంటారు. అక్కడికతడు తన కుటుంబాన్ని పిలుపించుకొని కాపురంచేయొచ్చు. ఆ వ్యవసాయం చేసినందుకు వారికి భాగమిస్తారు.

◆ ◆ ◆

మన దేశంలో 56,00,000 సాధువులున్నారట. వీరేమి పనిపాటలు చేయరట. వీరికి పని యేర్పాటు చేయను ప్రభుత్వము వారేర్పరచిన ప్లానింగ కమిషను వారాలోచిస్తున్నారు.

◆ ◆ ◆

10,00,00,000 గ॥ల జపానుగుడ్డను బ్రిటన్‌కు 1950 అక్టోబరు 1951 మార్చిలోపల తెప్పించడానికి బ్రిటిష్ ప్రభుత్వము లైసెన్సు లిస్తున్నది.

◆ ◆ ◆

మానవుని దేహాన్ని ఆయా పదార్థాలక్రింద విడదీసిచూస్తే 7 సబ్బు కోపులకు తగినంత క్రొవ్వు పదార్థమూ 10 గ్యాలనుల నీరూ, ఒక కోడిగూడు పూయడానికి తగినంత సున్నమూ చిటికెడు ఉప్పుకు సమానమయిన లవణమూ (మాగ్నెషియమ్) 2200 అగ్గిపుల్లలు చేయడానికి తగినంత భాస్వరమూ 9 వేల పెన్సిళ్లు చేయడానికవసరమైన కార్బనూ, 2 అంగుళాల గుండుసూది చేయడానికి పనికివచ్చునంత ఇనుమూ, 1 పొట్లము గంధకపు గుళికలు చేయడానికి చాలినంత గంధకమూ ఉన్నదని శాస్త్రజ్ఞులు పరిశీలించి తేల్చినారట. 140 పౌనులు బరువుగల మనిషి శరీరములోఉన్న పదార్థములివి.

◆ ◆ ◆

4 వ శతాబ్దములో పర్షియారాజు షాహోర్మజ్ దివంగతుడైనప్పుడు రాణి గర్భవతి. అంతర్యుద్ధము చెలరేగి సింహాసనముకొరకు పోట్లాటలు జరిగినప్పుడు రాణి తన గర్భస్థ శిశువు కుమారుడేననీ అంతర్వాణి వల్ల తనకీ విషయములో ధృవమేర్పడినదనీ చెప్పినది. ఆమెమాటమేరకు పర్షియనులు గర్భస్థశిశువునకే పట్టాభిషేకము చేసినారు. ఆ ఉత్సవము అద్వితీయ వైభవముగా జరిగినది. ఆమెకు జన్మించిన బాలుడు సాపర్ అన్న పేరుతో చాలాకాలము రాజ్యమును పాలించినాడు.

◆ ◆ ◆

ఈ సంవత్సరములో మనదేశంలో ఇప్పటికి 55 వైమానిక ప్రమాదాలు జరిగాయి. వీనిలో విమానం నడిపేవాని పొరబాటువల్ల జరిగినవి 27 కేసులు; ఇంజను మొదలైన విమానభాగాలు చెడిపోయినందున 9 కేసులు, చిల్లర కారణాలు 7, ఇంకా 12 కేసులు విచారణలో ఉన్నాయి.

◆ ◆ ◆

మద్రాసులో ప్రస్తుతం ప్రభుత్వంవారు 245 బస్సులు నడుపుతున్నారు. 45 దార్ల, ప్రతిరోజు ఇవి సగటున 33,500 మైళ్లుప్రయాణం సాగిస్తున్నవి. దీనిలో 2, 14, 000 మందిసగటున రోజు ప్రయాణం చేస్తున్నారు.

◆ ◆ ◆

(4-వ పుట తరువాయి)

## సర్దార్ పుత్రికారత్నము మణిబెన్

మణిబెన్ తనతండ్రిని సేవించడం నిత్యకృత్యంగా చూచుకొన్నది; ఆసేవ తనతండ్రికి సర్వస్వము అన్న విషయమెప్పుడూ గమనించి యెరుగదు. కాబట్టి ఈలేఖలు ఆమెకెంతో ఆప్యాయమైనవి. మణిబెన్ చాల బిడియముగలది; కాని ఆ బిడియము నామె తొందరపాటు చాటున మాటు వేసేది. జైలు జీవితముయొక్క కష్టనష్టముల నెదుర్కొనగల్గి, ఆ వయస్సునున్న వనిత కట్టిది నైజము.

సరియైన కాకువుతో ఆమె ఆంగ్లభాషను ధాటిగా మాట్లాడడం విన్నాను. ఆంగ్లభాష నేర్చిన బోర్డింగు హౌస్‌లో ఆమె కొంతకాలము విద్య నేర్చెనని వింటిని.

సర్దార్‌కు మణిబెన్ మంచి వివేకవతియగు కార్యదర్శిని. సర్దార్ అంతరంగిక కార్యదర్శియగు శంకర్ గారికి ఏయేవిషయములు తెలుపవలయునో ఆమెకు చక్కగా తెలియును. తండ్రిని చూడవచ్చిన వాడు ఆమెతోపాటు దయాదాక్షిణ్యములు చూపని వాడైతేనే ఆమె కొంతదాక్షిణ్యము చూపేది. తన తండ్రి ఘనతఅంటే ఆమె కత్యంతప్రీతి. ఆమెకు తన తండ్రి మిత్రులెవరో, విమర్శకులెవరో, బాగా తెలుసు. ఆమె అతని జీర్ణశక్తినికూడా బాగా ఎరుగును. ఆమె తనతండ్రి అభిప్రాయములతో సంపూర్ణముగ ఐక్యత సాధించినది. అతని కేవ్యవహారము ప్రియకరమో, ఆమెకదియే ప్రియకరము. ఆమెకు తనతండ్రి మోటహాస్యమంటే ప్రీతి; దానికామె ముదము చెందెడిది. ఆమె సకలప్రయోజనములతనిని పెనవేసుకొన్నవి.

---

(6-వ పుట తరువాయి)

## ఆంధ్ర మహిళామహాసభ, నెల్లూరు.

ఈసమావేశానికి ఆధ్యక్షత వహించుటకు అంగీకరించడంలోని నాలక్ష్యం వకటే. దేశసేవలో జీవితాలను చాలవరకు వెళ్ళబుచ్చిన పొణకా కనకమ్మ మున్నగువారు తిరిగి ఆంధ్రమహిళలకు నాయకత్వం వహించి అఖిల భారత మహిళాసభను బలపరచవలసినదిగా కోరడమే ఆలక్ష్యం. సభ్యత్వాన్ని పెంపుచేసి, శక్తివంతమైన సంస్థగా మహిళా సభను రూపొందించవలసిన అవసరం ఇప్పుడు కలిగినంతగా ఇదివరలో ఎప్పుడూ కలగలేదు, సంస్థ శక్తివంతంగా వున్నప్పుడే ప్రభుత్వమైనా, రాజకీయవాదులైనా గౌరవిస్తారు. కాని, ఏటేట జరిగే ఇట్టి సమావేశాలలో ఆమోదించబడే తీర్మానాలను బట్టికాదు. అఖిల భారతమహిళాసభ ఆంధ్ర శాఖను బలపరచే సందర్భంలో తొలిచర్యగా ఆంధ్రదేశంలో క్లబ్బుల పేరనో, సభలపేరనో వ్యవహరిస్తున్న స్త్రీ సంస్థల ప్రతినిధులతో ఒక సౌష్టవమైన సర్వసభ్య సంఘమును ఏర్పాటు చేయవలసినదిగా శ్రీమతి కనకమ్మ గారిని, లక్ష్మీబాయమ్మ గారిని ఇక్కడ సమావేశమైయున్న ఇతర నాయకురాండ్రను కోరుతున్నాను. ఈ సంఘం వేర్వేరు మహిళా సంఘాలతోకకాక సంస్థల ఫెడరేషనుగా ఉండాలని నా అభిప్రాయం. సర్వసభ్య సంఘమును ఏర్పాటుచేసుకొన్న పిదప సంవత్సరంలో కనీసం మూడుసార్లు అయినా అది సమావేశం కానిదే మహిళాసభ క్రొత్త సమావేశం జరపరాదని మనం ప్రతిజ్ఞ తీసుకోవలసియున్నది. సర్వసభ్యసంఘం బలిష్టమైన కార్యవర్గాన్ని ఎన్నుకోవాలి. ఈ కార్యవర్గం నెలకు ఒకసారిగాని, అవసరమైతే యింకా యెక్కువ పర్యాయాలు కాని సమావేశమౌతుండాలి. ఈవిధమైన యేర్పాటు చేసుకొన్నప్పుడే మనం కోల్పోయిన ప్రతిష్టను ప్రజ్ఞాప్రాభవాలను తిరిగి పొందగలము. ఆంధ్రరాష్ట్ర మహిళాసభ ఏటేట ఆమోదించే తీర్మానాలు సార్థకం కాగలవు.

---

దక్షిణకొరియా ప్రధాన నగరమును అమెరికన్ సేనలు, దక్షిణకొరియా ప్రభుత్వసేనలు విడిచి పారిపోతున్నవి; ఉత్తరకొరియన్, కమ్యూనిస్టు చీనా సైన్యములు ఉత్తరదిశగావచ్చి నగరము నాక్రమించుచున్నవి. దక్షిణాభిముఖులై పారిపోయేవారు నగరాన్ని తగులబెట్టి వెళ్లుతున్నారు. అమంటలు 50 మైళ్లవరకు కన్పిస్తున్నాయి. స్త్రీలు, శిశువులు, వృద్ధులు కదలలేనివారు రోడ్డువార చలికి, ఆకలికి మాడి చచ్చిపోతున్నారు. చచ్చినవారిని పాతిపెట్టడానికైనా పారిపోయేవారికి తీరిక, ఓపికలేదు. 10 లక్షలవన్నులు (90 పౌ॥ లకు సమానం) ఇచ్చిన కుటుంబాన్ని సైన్యంముందు అవతలికి దాటవేస్తున్నారు. అందరు మొగము వేలవేసుకొని ముందుకు నడచిపోతున్నారు. గుంతలు గతుకులు పడ్డ రోడ్లమీద 20,00,000 దక్షిణకొరియనులు, స్త్రీలు, పురుషులు ఈవిధంగా సాగిపోతున్నారు.

◆ ◆ ◆

సుమతి నెత్తురు తీసికోటానికి ఒప్పుకున్నాడు, వెంటనే సుమతిని పరుండచేసి ఆమె నెత్తుర్ని మెల్లగా గొట్టంలోకి లాగి అటు ఆ అబ్బాయి చేతిలోకి ఎక్కిస్తున్నాడు. సుమతి శోష వచ్చినట్లు పడిఉంది. అక్కడి నర్సులందరూ ఆమెను చేయవలసిందంతా చేసి సుమతిని కొనియాడుచున్నారు. ఆచిన్నిబాలుని రక్షించుటకై తన "స్వంత" బాధను కూడా లక్ష్యపెట్టక నెత్తురు ఇచ్చిందంటున్నారు. సుమతి రెండు మూడు రోజుల్లో, ఇంకా నీరసంగా ఉన్నప్పటికీ, మామూలుగా అయిపోయింది. పిల్లవాడు కూడా క్రమేపి ఆరోగ్యంపొందుతున్నాడు. డాక్టర్కి కూడా ధైర్యం కల్గింది. సుమతితో, "ఈపిల్లవాణ్ని నీవే బ్రతికించావమ్మా!" అన్నాడు. "కన్నతల్లి అయినా ఇంతగా చూసుకోదు" అంటున్నారు అంతాను. 24 గంటలూ పిల్లవాని దగ్గరే గడుపుతోంది సుమతి.

అక్కడ సుందరమ్మగార్కి సుమతిలేకుండా ఇంటి పనులు చక్కబడడం లేదు. సుమతి ఉన్నప్పుడు ఆమెకు ఏమీ చూచుకోనవసరం లేకపోయింది. సుమతి లేని కొరత బాగా తెలుస్తోంది. "అమ్మా! సుమతిని త్వరగా పిల్చుకోనిరా! ఆ అనాథల దగ్గిర ఎందుకుంచుతావ్!" అంటూన్నారు పిల్లలు. సుమతిని ఇంటికి పిల్చుకు పోదామని సుందరమ్మగారు ఆసుపత్రికి వచ్చింది. "ఇంక ఆఅబ్బాయి దగ్గర ఉండవక్కరలేదు. వాడు 4, 5, రోజుల్లో ఇంక అనాథాశ్రమానికి వెళ్లిపోతాడు. నీధర్మమా అని బ్రతికాడు. నీవు ఇంక నాతో ఇంటికి రావల్సింది" అని పిల్చింది ఆమె సుమతిని. కాని సుమతి, ఆ అబ్బాయికి పూర్తిగా నయమైతేనేగాని, రానని చెప్పింది. సుందరమ్మగారు సుమతియొక్క మాతృప్రేమను గ్రహించుకోలేక పోయింది. నీవు నేరమ్మంటే కూడా రావా?" అంది సుందరమ్మగారు. "క్షమించండి; రాలేను" అంది సుమతి. మంచికోపంతో కస్సున వెళ్లిపోయింది సుందరమ్మగారు. భగవంతుడు ఒక ఇల్లని చూపిస్తే, ఈపాపాత్ములు, నిర్భాగ్యులునైన అనాథలకు అది కూడా పోయింది! ఇంటినుంచి సుమతికి అన్నం కూడా రావడంలేదు. అయినప్పటికీ సుమతికి తన బిడ్డల దగ్గరనే ఉన్నానన్న తృప్తితో ఆకలికూడా వేయడంలేదు. నర్సులే ఎప్పుడైనా జాలి పడి పండో ఫలమో ఇస్తున్నారు. పిల్లవానికి బాగా నయమైపోయింది. ఆశ్రమానికి తీసుకు వెళ్లవచ్చునన్నాడు డాక్టరు. ఆశ్రమాన్నించి అబ్బాయిని తీసుకొని వెళ్లడానికి "మేట్రన్" ని పిలిపించారు. డాక్టరుగారికి తన ధన్యవాదాలర్పించి సుమతి కూడా ఆశ్రమానికే వెళ్లింది. ఆశ్రమంలో తాను ఏదైనా పని చేయగలననీ, అక్కడ ఉన్న బిడ్డలందర్నీ చూచుకుంటాననీ, కుట్టుపనులుగాని ఇంకా ఏ ఇతర పనులైనాగాని చేస్తాననీ, తానూ ఒక అనాథస్త్రీనేననీ చెప్పుకుంది "మేట్రన్"తో సుమతి. అక్కడే పనికి కుదిరింది. సుమతి తనతో రాలేదన్న కోపంవల్ల సుందరమ్మగారు మళ్లీరాలేదు. ...

సుమతికి ఆశ్రమంలో పనులు చాలా చేయవలసినప్పటికీ పిల్లలదగ్గరనే ఉన్నానన్న సంతోషంతో ఏమాత్రం విసుగు చెందకుండా పని అంతా చేసి, ఏకొంచెం తీరిక దొరికినా, పరిగెత్తుకునివచ్చి తనపిల్లలకు తలలుదువ్వి నీళ్లుపోసి మంచినడతలూ, గుణాలు, మొదలైనవన్నీ, వాళ్లకు చిన్ని చిన్నికథల మార్గంగా వినిపించి వారికి సత్ప్రవర్తనలు గరపుచూ ఉండేది. పిల్లలునూ అక్కడ ఆశ్రమాధికారులు నేర్పించే విద్యలే నేర్చుకుంటూ, తమ తల్లి తమవద్దనే ఉన్నదన్న విషయం లేశమైనా తెలియకుండానే, తమ ఎడల ప్రేమాదరముల చూపుచున్న స్త్రీ ఎడల తమ కృతజ్ఞతాపూర్వకమైన వాత్సల్యాన్ని వెల్లడి చేస్తూ దినాలు గడుపుచున్నారు. ...

(సశేషము)